# ప్రహ్లాదచరిత్ర

## ఎఱ్ఱన పోతనల కవితా తులనాత్మక పరిశీలన



గ్రంథకర్త

**డా॥ నందుల గోపాలకృష్ణమూర్తి**

ఆంధ్రోపన్యాసకుడు

స్నాతకోత్తర తెలుగు విభాగము ప్రభుత్వకళాశాల

**రాజమండ్రి - 5**

ధార్మిక గ్రంథముద్రణ ప్రణాళికపథకము ప్రకారము తిరుమల తిరుపతి దేవస్థానమొసంగిన ఆర్థికసాహాయ్యముతో ఈచిన్ని కావ్యము ముద్రితము.

## కృతజ్ఞతాంజలి

"ప్రహ్లాదచరిత్ర" విమర్శగ్రంథము రచించుటకు భవ్యకవితావేశము ప్రసాదించిన ఆంధ్రభారతికి నా భక్త్యంజలి.

ఈగ్రంథము సహృదయ కరభూషణముగ చేయుటకు సాయమందిచ్చిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు నా కృతజ్ఞతా పూర్వక సుమాంజలి.

ఈగ్రంథరచనకు ప్రతిక్షణము వెన్నుదట్టి నాకు ఉత్సాహ మొసంగిన ప్రాచార్య శ్రీ యస్వీ. జోగారావు మహోదయులకు ఆచార్య శ్రీ వంతరాం రామకృష్ణారావు గారికి అభివందనములు. వ్రాతప్రతిని సిద్ధముచేయుటకు చేయూత ఇచ్చిన శ్రీ వి. బ్రహ్మావధాని శ్రీమతి టి. నాగమణిగార్లకు కృతజ్ఞతాభివందనములు.

ఈగ్రంథమును అందముగ ముద్రించిన మాకూర్మి శిష్యుడు, మహేశ్వరిప్రెస్ అధిపతి చి. చలపతిరావునకు నా ఆశీస్సులు.

రాజమండ్రి
1-10-88

నందుల గోపాలకృష్ణమూర్తి

ప్రథమ ముద్రణము : 1000 ప్రతులు

వెల : 20/- రూపాయలు
1 9 8 8 విభవ

ప్రకాశకుడు
నందుల మైథిలీ శరణు
నందుల గోపాలకృష్ణమూర్తి
ఆంధ్రోపన్యాసకుడు
స్నాతకోత్తర తెలుగు విభాగము ప్రభుత్వకళాశాల.
రాజమండ్రి - 533 105

# ఉపయుక్త గ్రంథములు

ఈ గ్రంథరచన కుపయుక్తమైన గ్రంథకర్తలకు

**నా కృతజ్ఞతాంజలి**


సంస్కృత గ్రంథములు

1. కూర్మపురాణము
2. నారసింహపురాణము
3. పద్మపురాణము
4. బ్రహ్మపురాణము
5. బ్రహ్మాండపురాణము
6. భాగవతము
7. విష్ణుపురాణము
8. హరివంశము

ఆంధ్ర గ్రంథములు

1. ఆంధ్రభాగవతము (ఏకాదశి ప్రతి)
2. ఆంధ్రభాగవతోపన్యాసములు
3. ఆంధ్రభాగవత విమర్శ ఆచార్య శ్రీప్రసాదరాయకులపతి
4. ఆంధ్రవాఙ్మయ చరిత్ర ఆచార్య శ్రీ దివాకర్ల వెంకటావధాని
5. ఆంధ్రసాహిత్య చరిత్ర ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం

# సుహృదభినందనము

మిత్రులు, నందుల గోపాలకృష్ణమూర్తి గారు, నృసింహపురాణ మహాభాగవతములయందలి ప్రహ్లాదచరిత్రలను తులనాత్మక పరిశీలనముచేసి యీగ్రంథమును రచించుట ముదావహము. ఎఱ్ఱన పోతన లిరువురు నద్వైతులు. భక్తిభావమరందతుందిల హృదయారవిందులు. భవ్యకవితావేశులగు మహాకవులు. మఱి భేదమేమనగా, నెఱ్ఱన భక్తిభావప్రపూర్ణ చేతస్కుఁడు కాఁగాఁ, బోతన భక్తిభావావిష్టచేతస్కుఁడు. భారతకవియగు నెఱ్ఱన, భవ్యకవితావేశుఁడు కాఁగా, భాగవతకవియగు పోతన, స్వాత్మాశ్రయ కవితాధర్మానుప్రాణిత భవ్యకవితావేశుఁడు. ఏతాదృశగుణమహిమ ఖ్యాతాసమ నవనకవన గణనీయులుగా, నిమ్మహాకవులను గుర్తించి, డా॥ నందులవారు, తులనాత్మక పరిశీలనము నెఱ్ఱన పోతనలయెడఁ గల భక్తిపెంపున, నిర్వహించుట బహుధా ప్రశంసనీయము. ఇతివృత్త నిర్వహణము, పాత్రపోషణము, మున్నగు విషయములలో, నెఱ్ఱన పోతన లవలంబించిన పద్ధతులను డా॥ నందులవారు సమాలోచించిన తీరు, సహృదయ హృదయంగమము. ఎఱ్ఱన సోమనల హరివంశములను దులనాత్మక పరిశీలనముచేసిన పూర్వవిమర్శకులవలె స్వపక్షపరపక్ష భేదబుద్ధి వహింపక, సమచిత్తముతో దులనాత్మక పరిశీలనముచేసిన డా॥ నందులవారి తులనాత్మక పద్ధతి, పరిశోధకుల కొజ్జబంతిగా నున్నందుకు వారిని హృదయపూర్వకముగా నభినందించుచున్నాను. ఇంతలోఁ దనివి సనక డా॥ నందులవారు నిరంతర సాహిత్యాధ్వనీనులు కావలెనని యాకాంక్షించుచున్నాను.

— పంతరాం రామకృష్ణారావు

6. కావ్యాలంకార సంగ్రహము శ్రీ సన్నిధానము వారి వ్యాఖ్య

7. ఎఱ్ఱన సాహిత్యలహరి ఎఱ్ఱన పీఠము - ఒంగోలు

8. నృసింహపురాణమునకు మూలము శ్రీమతి ఆచార్య పి. యశోదారెడ్డి

9. ప్రబంధపరమేశ్వరుడు ఆచార్య శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం

10. పోతన శ్రీ నిడదవోలు వెంకటరావు

11. పోతన ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డి

12. శారదావిపంచి ఆచార్య శ్రీ యస్. వి. జోగారావు

13. సాహిత్యదర్శనము ఆచార్య శ్రీ కె. వి. ఆర్. నరసింహం



# శ్రీ ప్రహ్లాద చరిత్రము

## కవి పరిచయము

కవిత్రయమున తృతీయుడైన ఎఱ్ఱన క్రీ॥ శ॥ 1319-1320 కాకతీయ సామ్రాజ్య పతనానంతరము అద్దంకిని రాజధానిగా చేసికొని పరిపాలించిన ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి. ఆతడు ప్రకాశముజిల్లాలోని, కందుకూరు మండలములోని గుడ్లూరులో జన్మించెను. కాలక్రమమున ఒంగోలు సమీపమున నున్న చదలవాడ చేరెను. విప్రనారాయణ చరిత్ర రచించిన చదలవాడ మల్లయ ఎఱ్ఱనను తన వంశ కర్తగా స్తుతించెను.

"దురిత హరు ప్రబంధ పరమేశ్వరుని చెద
ల్వాడ నిలయు నాదు వంశ కర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱా ప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును దరంబె"

ఎఱ్ఱన కావ్యముల పౌర్వా పర్యమును గూర్చి విమర్శకులలో నభిప్రాయభేదము లున్నవి కొంతమంది గ్రంథముల ఆను పూర్వి యిట్లు చెప్పుచున్నారు.

(1) ఆరణ్య పర్వశేషము (2) రామాయణము (3) హరివంశము (4) నృసింహ పురాణము. మఱికొందఱు (1) రామాయణము (2) హరివంశము (3) ఆరణ్య పర్వశేషము (4) నృసింహ పురాణము నని చెప్పుచున్నారు ఈ రెండు వాదముల సామంజస్యము పరిశీలింపవలసియున్నది.

హరివంశమున రామాయణ ప్రశంస కలదు

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ
నాథుండు సన్మానితత
శ్రీ తోడన్ సముపేతుఁ జేసి, యెలమిం
జేపట్టి మాకిచ్చుటం

# దశదళపద్మము

హైమనస్యముతో లక్ష్మీనృసింహావతారంబను పురాణకథను పరమ రమణీయమైన ప్రబంధముగా వినిర్మించెను పితామహుని ప్రేరణపై ఎఱ్ఱాప్రగడ తెలుగు సాహిత్యమున మున్మొదట క్షేత్రమాహాత్మ్య రచనకు శ్రీకారముచుట్టి శ్రీనాథాదులకు మార్గదర్శకుడయ్యెను. రాయల యుగమున వెలసిన ప్రబంధవర్ణనలకు ఎఱ్ఱనయే సర్వవిధముల మార్గదర్శకుడు. ఈ గ్రంథమున నృసింహావతారమునకు కారణభూతమైన ప్రహ్లాద చరిత్రయే కావ్యవస్తువు.

పోతన :-

మహాభక్త శిఖామణియైన పోతనార్యుడు సంస్కృత భాగవతమును మందార మకరంద మాధుర్యము జాలువారునట్లు ఆంధ్రీకరించెను. పోతన క్రీ. శ. 1420-1480 కాలమని విమర్శకుల అభిప్రాయము. పోతన జన్మస్థలము ఓరుగల్లు మండలములోని బమ్మెర. కౌండిన్యస గోత్రము. తండ్రి కేసనమంత్రి. తల్లి లక్కమాంబ అన్నగారు శివదీక్షాదక్షుడు. శివపాదపద్మోపజీవుల తనయుడు మన పోతన. అష్టాదశ పురాణములలో భాగవతము విశిష్టమైనది.

సత్యం పరం ధీమహి యను—

గాయత్రీ ప్రారంభంబున గాయత్రీ నామ బ్రహ్మ రూపంబై మత్స్యపురాణంబులోని గాయత్రినధికరించి ధర్మ విస్తరంబు జెప్పంబడు నదియే భాగవతంబు.

శ్రీమంతమై ముని శ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ వినఁగోరు వారల విమల చిత్తంబులఁ జెచ్చర నీశుఁడు చిక్కుఁగాక

యితర శాస్త్రంబుల నీశుండు చిక్కునె
వేదకల్పవృక్షవిగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫల రసాస్వాదన
పదవి గనుడు రసిక భావ విదులు 1. భా – ప్ర – 35

ఆర్యఋషి పుంగవులు మానవాళికి మోక్ష సాధనములుగా జ్ఞాన, కర్మ, భక్తి మార్గములనుపదేశించిరి. ఇందు అధికారి తారతమ్యమునుబట్టి వారి శక్త్యను సారముగా, అభీష్టాను సారముగా మార్గము వరించుట వ్యక్తి నిష్ఠము. జ్ఞానమార్గము బ్రహ్మజ్ఞులైన పరిణత చిత్తులకు సాధ్యము. కర్మమార్గము కొందరకు ఉపాదేయము.

జేతోమోద మెలర్ప, రామ కథమున్
చెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితినింక నేను దనియన్
గావ్యామృత స్వాదనన్

నీనిని బట్టి హరివంశముకంటె ముందు రామాయణము నెఱ్ఱన రచించె ననుటకు కవి మాటలే ప్రబలసాక్ష్యములు. హరివంశమున, అరణ్య పర్వశేషమును గూర్చి ప్రస్తావించలేదు, అప్పటికి అరణ్య పర్వశేషము రచించి యుండినచో ఎఱ్ఱన దానిని ఏల ప్రస్తావించియుండడు ? ఎఱ్ఱన కవితా వైజయంతికకు నాయకమణి అరణ్య పర్వ శేషమనుట ఆతని అభిమతము.

"నన్నయభట్టు తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపుతో, ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్యకర్తయై, యెన్నికమై ప్రబంధ పరమేశ్వ రనంగ నరణ్య పర్వశేషోన్నయము ఆంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి నాడని ప్రశంసపొందెను. ఇంత కవితా గౌరవ ప్రతిష్ఠకారణమగు అరణ్య పర్వశేష మును రచించి యున్నచో ఎఱ్ఱన హరివంశమున, ఏల ప్రశంసించి యుండడు ?

ఈ హేతువులచే, అరణ్యపర్వశేషము హరివంశ రచనానంతరమే ఎఱ్ఱన చేసి యుండునని విశ్వసించవచ్చును. నృసింహపురాణమున అరణ్యపర్వశేషోన్నయముచేసి నట్లు, "ఉన్నత సంస్కృతాది" అను పద్యమువలన తెలియు చున్నది. పైపరిశీలనము వలన ఎఱ్ఱన గ్రంథముల అనుపూర్వి ఈక్రింది విధముగ గ్రహించుట యుక్తము (1) రామాయణము (2) హరివంశము (3) అరణ్యపర్వశేషము (4) నృసింహపురాణము. ఎఱ్ఱన చరమ జీవితమున నృసింహపురాణము రచించి యుండునని చెప్పనగును.

ఇతడు పోతమాంబా, సూరనల గర్భ శుక్తి ముక్తాఫలము. ఇతనిది శ్రీవత్స గోత్రము. ఇతడు శివభాగవతుడు అగు శంకరస్వామి పాదపద్మ మధుపము. తాత ఎరపోత సూరి. ఇతడు శంభుదాసు డని చెప్పకొనెను అయినను హరివిలాసములో హరవిలాసము దర్శింపగల అద్వైతి. ప్రబంధ రచనా పాత్రీవీణ్యము ఎఱ్ఱనకు వెన్నతో పెట్టిన విద్య. ఆ మహా సౌజన్యమూర్తి నన్నయ్యభట్టు, తిక్క కవి నాథుల కెక్కిన భక్తి పెంపుతో నరణ్య పర్వశేషము నాంధ్రభాష యందు సుజనో త్సవ మొప్పగ నిర్వహించి ప్రబంధపరమేశ్వర బిరుదము నందిన సుకవి శ్రేష్ఠుడు. గిరిశ పద భక్తి రసతత్పర భావము కలిమి గోవింద గుణాదర సంభృత

దుల చరిత్రములు భక్తిమార్గమునకు ఉజ్జ్వల మణిదర్పణములు. ప్రహ్లాదుడు, ధ్రువుడు అంబరీషుడు మొదలగు మహాభక్తులు ఎన్ని కష్టములు వచ్చినను భక్తిమార్గము వదలక పరమేశ్వర పాదపద్మసమాశ్రయణము చేత తరించిరి. శతపరంపరగా కష్టములెదురగుచున్నకొలది వారి భక్తిపరిణతత్వము పరిగాఢమై అగ్నితప్తమైన బంగారము వలె ప్రకాశించెను. చివరకు పరమేశ్వరుడు వారి అండ నిలచి వారిని బాధించిన వారిని శిక్షించి భక్తపారవశ్యముతోపాటు భక్తరక్షణ పరాయణత్వము ప్రకటించెను. మహాభక్తాగ్రేసరుడగుటచే పోతన భాగవతమున వర్ణింపబడిన భక్తులలో తాదాత్మ్యముపొంది ప్రహ్లాదాది భక్తుల చరిత్రలను మృదుమధురముగా పలికెను.

భారతదేశములోని ప్రాంతీయభాషలగు తమిళ, కన్నడ, మలయాళ, ఒరియా, మహారాష్ట్ర, హిందీ భాషలలో భాగవతము వెలసినది. వీటికి విశేషప్రచారము రాలేదు కేరళ దేశమున ఎజుత్తచ్ రచించిన భాగవతము కొంత ప్రజాదరము పొందినది. ఇన్ని భాగవతములున్నను ఆంధ్రభాగవతమునకు పట్టిన అదృష్టము వేటికి పట్టలేదు. దానికి కారణము ఆ కవులు కావ్యనిర్మాణదక్షులు, కవితాతపస్వులు కారు. ఈ రెండు గుణములు కలవాడు మన పోతన. (శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులవారు ఆంధ్రభాగవతోపన్యాసములు)

భాగవతము సహస్రదళ పద్మము. అందు ప్రతిపత్రము భక్తి సురభిళము, ఈ కవియోగి సర్వరసములను సర్వాంగ సుందరముగ పోషించి సహృదయులను రసానంద డోలికలలో విహరింపచేసెను సప్తమ స్కంధమున పోతన అమృత హస్తము నుండి జాలువారిన భక్తిరసవాహిని ప్రహ్లాద చరిత్ర.

ఎఱ్ఱన లక్ష్మీనృసింహావతారమునకు కారణభూతమైనది ప్రహ్లాద చరిత్ర. ఈ రెండింటి తులనాత్మక పరిశీలనము చేయుట ఒక ముచ్చట ఎఱ్ఱన 14వ శతాబ్ది పూర్వ భాగమున ఉండెను. పోతన 15వ శతాబ్దపు ఉత్తరభాగమువాడు. ఇరువురు మహాకవులు భిన్నకాలములలో విలసిల్లిన వారు. ఒకే కథను ఎంతో సమర్థముగ నిర్వహించిరో పరిశీలించుట సాహిత్యభక్తులకు సుప్రసాదము. ఆధ్యాత్మికముగ భావించినచో ఎఱ్ఱనకు, పోతనకు అభేదము. ఎఱ్ఱన అంశమే పోతనగా పుట్టిఉండెనా? అనిపించును. ఈ రెండు గ్రంథములను తులనాత్మక పరిశీలనము చేయుట అనగా పరబ్రహ్మమును నిర్వచించుటయే! పూలనవ్వు, చందమామ వెన్నెల, మధుమాస మాధుర్యము ఎట్టివో ఎఱ్ఱన, పోతనల కవితామాధుర్యములట్టివి. జాజిపూల దండ

శ్రుతి, స్మృతి, పురాణాదులు లింగ, వర్ణాశ్రమ వయోభేదముల ననుసరించి మానవుడు జన్మాది మరణ పర్యంతము నిర్వహింపవలసిన కర్మకలాపము నిర్దేశించినవి. ప్రత్యవాయము లేకుండ యథావిధిగా కర్మనాచరించుట సామాన్య మానవునకు నసాధ్యము. పండిత, పామర భేదములేక సర్వమానవులకు సంసార తరణోపాయము. సులభమైన పూలు పరచిన భక్తిమార్గము. భాగవతము జ్ఞాన, కర్మమార్గముల నిరసింపక పోయినను, భక్తిమార్గమున కత్యంత ప్రాధాన్యమొసంగెను.

వరగోవింద కథాసుధారస మహావర్షోరుధారా పరం
పరలంగాక బుధేంద్రచంద్ర యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీరకఠోర కల్మష కనద్దావానలం బారునే
నశిన నయనుభక్తి నావచేఁగాక
సంసార జలధి దాటి చనగరాదు 2. భా — ప — 47

ఇట్లు సహస్రవిధముల భక్తి శంఖము పూరించినాడు. అంత వరకెందులకు, వ్యాసమహర్షి లోకసంగ్రహార్థము వేదవిభాగము చేసియు, బ్రహ్మసూత్రములను రచించియు, తనివి సనక విషణ్ణుడై, నిషణ్ణుడై యుండెను. అపుడు నారదమహర్షి వ్యాసమహర్షి మనసులోని వగపునకు కారణము నీవు పూర్వము అంచితమైన ధర్మచయమంతయు చెప్పితివి. అందులోన నించుకగాని విష్ణు కథలేర్పడ చెప్పవు, ధర్మములను ప్రశంసించిన మెచ్చునా ?

శ్రీమహావిష్ణువు గుణగానము శరణ్యము. యమనియమాది యోగముల నాత్మ నియంత్రితమయ్యుఁగామ రోషముఁబ్రోచితమగుటచే శాంతివహింపదు. విష్ణుసేవచేఁ గ్రమమున శాంతిగైకొనిన దైవడి నని విష్ణు సేవామహిమను నారదుడు బహుధాప్రస్తుతించెను.

శ్రీవైష్ణవమునకు భాగవతము పరమ ప్రమాణగ్రంథము. భగవంతుని యేకవింశత్యవతారములు నిందు వర్ణితములు. భాగవతములోని ప్రధాన కథలలో భగవంతుని భక్తరక్షణ పరాయణత్వము ప్రపచింపబడినది. భక్తులకు దుష్టులవలన కలుగు ఆపద గ్రహించి, దయాపయోధియయిన శ్రీమన్నారాయణమూర్తి వారిని ఆపత్సముద్రమునుండి రక్షించి దుష్టులను యథోచితముగ దండించును. భక్తిమార్గమునకు లక్ష్య, లక్షణములను నిర్దేశించిన గ్రంథము భాగవతము. ప్రహ్లాదాంబరీషా

ఎఱ్ఱనను చంకనెత్తుకొని సోమనను కాలనెట్టిరి. ఒక పక్షమువారు సోమనను చంకనెత్తు కొని ఎఱ్ఱనను కాలనెట్టిరి. అట్లుకాక నిష్పాక్షికముగా తులనాత్మక పరిశీలనము చేయుట ఆవశ్యకము.

ఎఱ్ఱన, పోతనల ప్రహ్లాద చరిత్రలను అధ్యయనము చేసి ఆ యా కవుల ఆత్మీయతను సహృదయతతో అనుశీలించి భక్తి కవితా మకరందము గ్రోలుటయే సాహిత్యసత్య వ్రతులకు ధ్యేయము.

భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీకయా

ఎఱ్ఱన లక్ష్మీనృసింహావతారము, పోతన ప్రహ్లాద చరిత్ర అర్థము చేసికొనుటకు పాండిత్యముగాని, వ్యాఖ్యానముగాని సరిపోదు. భక్తిమాత్రమే భాగవత మకరందము ఆస్వాదించుటకు అర్హమైనది.

# 2. నృసింహపురాణము – కథాసంగ్రహము

## భాగవతమందలి ప్రహ్లాద చరిత్ర– కథా తారతమ్య పరిశీలనము

### నృసింహపురాణకథ :–

ప్రథమాశ్వాసము :–

నిఖిలభువన పావనంబైన నైమిశారణ్యమున పుణ్యాత్ములగు మహర్షులు ఆనందోల్లసిత మనస్కులై రోమహర్షణునివలన అఖిల పురాణములు వినుచు క్రమ ముగ బ్రహ్మాండపురాణంబున తీర్థభాగశ్రవణము చేయుచుండిరి. అప్పుడు మహర్షులడి గిన ప్రశ్నకు సమాధానముగా రోమహర్షణుడు తానుమున్ను వ్యాసునివలన విన్న యహోబల క్షేత్రమాహాత్మ్యము నిట్లు వివరించెను. పూర్వము సద్గుణ శోభితుడగు గాలవుడను మునీశ్వరుడు తీర్థసేవాత్యంతిక బుద్ధితో భూప్రదక్షిణముచేసి సకల తీర్థము లను దర్శించి అహోబల క్షేత్రమును సందర్శించి పాపనాశినిలో అఘమర్షణ స్నాన మాచరించి నృసింహస్వామిని సేవించి మహర్షి గణమధ్యమున మార్కండుని భంగి

మల్లెపూల దండ వేణుగోపాలుని వక్షస్థలమున అలంకరించి మనకు ప్రసాదముగ నిచ్చి నచో ఏ దండను తిరస్కరింపగలము ?

ఈ సందర్భమున శంకర భగవత్పాదులు ఆనందలహరిలో చెప్పిన శ్లోకము స్మరింపదగియున్నది.

శ్లో, ఘృత-క్షీర-ద్రాక్షా మధుమధురిమా కైరపి పదై
ర్విశిష్యా నాఖ్యేయో భవతి రసనామాత్ర విషయః
తథాతే సౌందర్యం పరమశివ దృఙ్మాత్రవిషయః
కథంకారం బ్రూమ స్సకల నిగమాఽగోచరపదే.

ఆనందలహరి - 2 శ్లో.

నేయి, పాలు, ద్రాక్ష పండ్లు - వీనియొక్క తియ్యదనము నాలుకకు మాత్రమే తెలియును. మాటలచే వీని తియ్యదనము విశేషముగా చెప్పుట శక్యమగుటలేదు. తల్లీ నీ సౌందర్యమెట్టిదో ఒక్క పరమ శివుని కంటికే తెలియును. అఖిల వేదములకే యందు కొనశక్యముకాని పదములు గల దానవు. అమ్మా నిన్ను గూర్చి మేమేమి పలుకగలము. అయినను మనము త్రిగుణాత్మకమైన జగత్తులో జీవించియుండుటచే ఈ రెండు కథలను పోల్చి ఆ కవీంద్రుల కవితా గంగాలహరిలో మునిగి పవిత్రులమగుట మనకర్తవ్యము.

విమర్శనారంభమున తులనాత్మక పరిశీలనము ఒక సోపానము. సమానేతి వృత్తములుగల కావ్యములను సమాన మనోధర్మములుగల కవులను, సమకాలికులైనను కాకపోయినను, పరస్పరము పోల్చి తారతమ్య నిరూపణము చేయుట సర్వభాషా సాధారణము. గిల్బర్టు ముర్రే అను విమర్శకుడు గ్రీకు, విషాద రూపకములందు కట్టి ఓరెస్టిస్ అను పాత్రకును, షేక్స్పియర్ మహాకవి రచించిన హేమ్లేట్ అను పాత్రకును గల సాదృశ్యమును పరిశీలించి ఆరెండు పాత్రలును, ఒక్కటే మౌలిక రూపమునకు సాంకేతికములని నిరూపించియున్నాడు. ఈ రెండు పాత్రలను సృజించిన కవులు ఒక నాటివారు కారు. ఒక సంఘమునకు గాని ఒక దేశమునకు గాని సంబంధించిన వారుకారు. వారిదొక భాషకాదు. అయినను నిశిత పరిశీలనమున వారియందున్న ప్రధాన సాదృశ్యము కనుగొనఁబడినది. కావున తులానాత్మక పరిశీలనము వలన నానా రచనల మౌలిక రూపమును గుర్తింపవచ్చును.

ఎఱ్ఱన, నాచన సోమనాథుల హరివంశములను తులనాత్మక పరిశీలనముచేసి పెద్ద గాలిదుమారము లేవనెత్తిరి. లోకము భిన్నరుచి కలిగినది కదా! ఒక పక్షమువారు

దక్కవలెననియు భావించి సురరాజ్య పదవిగోరి గంధమాదనమున ఘోరతపమాచరించెను. ఆయా ఋతువులలో ద్విగుణీకృతోత్సాహముతో తపము కొనసాగించెను. ఆ రక్కసుని తపము పెంపునకు తలంకి దేవేంద్రుడు, బృహస్పతినిచేరి ఉపాయము కోరెను. మతిమంతుడైన దేవమంత్రి సకలమంత్ర శ్రేష్ఠమైన నారాయణ మంత్రము నుపదేశించెను.

దేవేంద్రుడు రంభాదిన్యప్సరసలను ఏకాంతముగా పిలిచి హిరణ్యకశిపుని తపోభంగముచేసి తన పదవిని నిలబెట్టుడని పంపెను. మరున్నాయకుని మాట ప్రకారము అచ్చరమచ్చెకంటులు గంధమాదనము ప్రవేశించిరి. అంత జగన్మోహనమైన మాధవాగమనమయ్యెను. ఎచట చూచినను వనములందు పుష్పసౌరభము, మందమదాళి ఝుంకారములు, సాంద్రపల్లవములు, కోకిల కూజితములు, కోమలకీర భాషితములు విలసిల్లెను. ఆ మందయానలు హిరణ్యకశిపుని ఆకర్షించుటకు చేసిన టక్కులు టెక్కులు అడవిగాచిన వెన్నెల లయినవి. బ్రహ్మవచ్చి హిరణ్యకశిపునకు కోరిన వరములిచ్చి పోయెను. వరగర్వితుడైన దైత్యరాజు దేవతలనుపెట్టిన తిప్పలు ఇన్నిన్ని కావు. బక్కచిక్కిన మునులను తీసికొనివచ్చి అచ్చరలతో పెండ్లిచేయును. పాముల శిరములందున్న మణులను పెరికివైచి వటువ గుండులెత్తును. గంధర్వులచేతిలోని వీణలను పిశాచులకిచ్చి పాడించి నవ్వును. అనాదరముతో ఈశ్వరునిజోలికి మాత్రము పోలేదు.

ఉ. ఎక్కడి దెద్దుభూతియును నెమ్ములు సొమ్ములు భిక్షజీవనం
బొక్కటి కట్టఁజీరయును నుండఁగనిల్లును లేదు నిక్కవం
బిక్కఅకుందపస్విజను నేచిన నయ్యెడు నేమి యంచుఁదా
నొక్కని శర్వుని న్బఱుప నొల్లఁడు దైత్యుఁడనాదరంబునన్

1. నృసింహ-2-124

తృతీయాశ్వాసము :-

ఇంద్రాది దేవతలు బృహస్పతిని కర్తవ్యోపదేశమును చేయుమని వేడుటయు నతడు తమకు వాసుదేవ స్మరణమే కర్తవ్యమని బోధించెను. దేవమంత్రి హితోపదేశముతో దేవతలందరు ఇంద్రపురస్సరముగ శ్వేతద్వీపమునకు వెడలి శ్రీ మహావిష్ణువును బహువిధస్తోత్రములతో స్తుతించి తమ దుస్థితిని నివేదించిరి.

ప్రకాశించు దేవశర్మను ఇట్లు ప్రశ్నించెను. అఖిల లోకేశ్వరుడైన శ్రీ మహావిష్ణువుతో హిరణ్యకశిపుడు ఏలవిడువని వైరము పూనినాడు ? ప్రహ్లాదుడు ఎట్లుంగి శ్రీమహావిష్ణువును ఎట్లు మెప్పించెను ? శ్రీనరసింహమూర్తి ఏ కారణమున జన్మించెను? ఈతనికి అహోబలనాథుడను విఖ్యాతి ఎట్లు కలిగెను? ఇందలి ప్రాశస్త్యార్థము లెయ్యవి ? ఇంపు మిగుల సవిస్తరముగ ఆనతిమ్మని ప్రార్థించెను దేవశర్మకు మునిసేవితము సమగ్ర బోధ సిద్ధప్రదము, శ్రుతిసంభావితముగు లక్ష్మీనృసింహావతార కథను గంభీర వాక్ప్రౌఢితో నిట్లుపవచించెను క్షీరసముద్రమున శ్వేతద్వీపము గలదు. తదంతరమున వైకుంఠము దీపించును. అందు శేషతల్పమున శ్రీహరి యోగనిద్ర నుండగ శరత్కాలము ప్రాప్తించెను. అంత, నిద్ర మేల్కొను విష్ణువు లక్ష్మీదేవితో వినోదించునవసరమున కొలువు చేయుటకు సంయమివరులు బృందారకులు నేగుదెంచిరి. వేత్రహస్తులైన జయవిజయులు వచ్చిన వారిని వేచియుండుడని మందిర బహిర్ద్వారమున నిలిపిరి. అంత సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు సనత్సుజాతుడు ముకుంద దర్శనము చేయవచ్చిరి. వారిని జయవిజయులను ద్వారపాలురు అడ్డగించి ఒకింతసేపు ఓర్పుతో నిలిచి యుండుడని నిలిపిరి. అద్దానికి వారు కోపము చిచ్చుతాకున బోధి పల్లవము కందగ ఓర్పుఅను వ్రతమునకు విఘాతము కలుగ కోపోద్దీపిత చిత్తులై ఆ జయ విజయులను ధర్మ విస్మృతులుగ కల్మషకారులుగ, దుష్టమోహావిల బుద్ధితో రాక్షసులై జన్మింపుడని శపించిరి. ఆ వృత్తాంతమంతయు విష్ణుమూర్తి గ్రహించి సంభ్రమముతో అచటికి వచ్చి జయవిజయులు చేసిన తప్పు తనదని శాంతింపుడని సనకాదులను అనునయించి పంపెను విష్ణుమూర్తి జయ విజయులను హిరణ్యకశిపు, హిరణ్యాక్షులుగ పుట్టి శ్రీమహావిష్ణువుతో ఎడతెగని వైరము పెంచు కొనుటచే తిరిగి విష్ణుమూర్తి సాయుజ్యము పొందగలరని ఆనతిచ్చెను. అతడు తన ద్వారపాలకులను ఓదార్చి ఇదియంతయు తన మాయా బలముచే జరిగినదని చెప్పెను. అతి మాత్ర శత్రుత్వము వలన వారు విష్ణుమూర్తిని పొందగలరని ఆనతిచ్చెను అట్లే వారు జన్మించిరి.

ద్వితీయాశ్వాసము :-

దితిసుతులు, హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అను నామములతో ప్రఖ్యాతి గాంచిరి. వారిలో హిరణ్యకశిపుడు ప్రకృతి సిద్ధమగు పౌరుష్యముతో వర్తించుచు అమరుల తల్లికంటె తమతల్లి దితి, శ్రేష్ఠురాలనియు త్రిలోక రాజ్యభోగములు తనకే

ప్రహ్లాదుని ప్రార్థనపై విష్ణుకింకరులు యముని విడిచిపుచ్చిరి. మరల హిరణ్యకశిపుడు కొలువు దీర్చి ప్రహ్లాదుని రావించెను. ప్రహ్లాదుడు విష్ణుమహిమను విజ్ఞాన పరవశుడై కీర్తించెను. విష్ణువు సర్వమునందు గలడని వాకుచ్చెను. అంత రోష, హాస వికృతాస్యుడై ఇందుగలడా ? అని స్తంభముపై కరతాడనము చేసెను. స్తంభము పగిలి నృసింహమూర్తి యావిర్భవించెను. నృసింహమూర్తి హిరణ్యకశిపుని లోక భీకరముగవధించి ప్రహ్లాదుని రక్షించెను. నృసింహమూర్తిని ప్రహ్లాదాదులు స్తోత్రము చేసిరి. నృసింహమూర్తి ప్రహ్లాదుని ఓదార్చి "ఈమహానీయస్థానంబు పరమ మంగళంబైనన్ను దనయందు నుసుసంగోరు చున్నయది. నా హృదయంబునన్ జూడ్కులు నిండంబ్రియంబునొందంగావున నీ మహాశైలంబునందు నుండంగలవాడ మీరు మదీయ బలంబహోబల శబ్ద పూర్వకముగ ప్రశంసించితిరి గావున నీ తీర్థం బహోబల నామధేయంబునందు త్రిభువన పావనంబై వెలయుంగాక అని యానతిచ్చెను. పిమ్మట లక్ష్మీదేవి నృసింహుని చేరవచ్చెను నరసింహమూర్తి క్షేత్రతీర్థమాహాత్మ్యము ను వెల్లడించెను. ప్రహ్లాదుని రాజ్యాభిషిక్తుని జేసి వరమును కోరుకొమ్మనెను. ప్రతి జన్మమున విష్ణు భక్తి ప్రసాదింపుమని ప్రహ్లాదుడు వేడెను. ఇట్లు ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహావతార కథను నిఖిలభువన హృద్యముగ రచించెను.

## భాగవత కథ

బ్రహ్మమానస పుత్రులగు సనక, సనందాదులు నైదారేండ్ల ప్రాయ్యంపు బాలకుల భావంబున దిగంబరులై హరిమందిరము ప్రవేశించుటకు వచ్చిరి. అంత హరిద్వార పాలకులు ఆముని కుమారులను వారించిరి. మునీశ్వరులు కోపించి శపింపగా వారు దితికి హిరణ్యకశిపు హిరణ్యాక్షులను రాక్షసులుగా పుట్టిరి. విష్ణుమూర్తి వరాహ రూపమున హిరణ్యాక్షుని సంహరించెను. హిరణ్యకశిపుడు తమ్ముని హత్యకు కారణమైన విష్ణువుపై పగ పెంచుకొనెను.

హిరణ్యకశిపునకు పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుడు పుట్టెను. ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవుని యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానపరాయణుడు. హిరణ్యకశిపుడు పుత్రుని విద్యాభ్యాసము కొరకు శుక్రాచార్యుని తనయులైన శండామర్కులను ఉపాధ్యాయులకడకు పంపెను. ప్రహ్లాదుడు తన విష్ణుభక్తిని, రాక్షస బాలురకు కూడ నూరిపోసెను. వారు, ప్రహ్లాదునికి ఈ విష్ణుభక్తి ఎటు వచ్చినదని ప్రశ్నించిరి. ప్రహ్లాదుడు తాను గర్భస్థుడై ఉండగా ఇంద్రుడు తన తనిల్లిబంధించి

శ్రీహరి హిరణ్యకశిపుని కాలము మూడినప్పుడు తాను నృసింహావతారము ధరించి చంపగలనని దేవతలను ఓదార్చి పంపెను. హిరణ్యకశిపుడు ఒకనాడు భార్యాసహితుడై నిదాఘసమయమున ఉద్యానవన విహారాదులతో ప్రొద్దు పుచ్చెను. ఆనాటి రాత్రి హిరణ్యకశిపుని భార్య కింగాంచిన స్వప్న ఫలమును శుక్రాచార్యుని వలన తెలిసెను. ఆ పిదప కుమారునకు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడని నామకరణము చేసెను. ఆసురరాజ తనూభవుడు పుట్టినాటినుండి విష్ణుపద కమల ధ్యాన నిరతుడై వినయ ప్రవర్తనుడయ్యెను. మూడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్లకులేదు అనునటు ప్రహ్లాదుని నడవడిలో ప్రస్ఫుటమయ్యెను.

చతుర్థాశ్వాసము :-

హిరణ్యకశిపుని పంపున ప్రహ్లాదుడు విద్యాభ్యాసమునకై గురు గృహమున నివసించెను. చదువుకొనుచుండగా నొకనాడు ప్రహ్లాదుని రావించి సుభాషితరత్నము చెప్పుమని హిరణ్యకశిపుడు ప్రశ్నించెను. ప్రహ్లాదుడు విష్ణుమహిమానుభావమును విస్తారముగ సకల ముని సంసేవ్యముగ ఉపన్యసించెను. హిరణ్యకశిపుడు కేశవ పక్షపాతముతో ప్రియపుత్రుడు చెడిపోవుచున్నాడని భ్రమించి అనేక బాధలుపెట్టించెను. కాని అవి అన్నియు విఫలమయ్యెను. భార్గవ నందనుల సూచనపై మరల హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని గురువుల కప్పగించెను. ప్రహ్లాదుడు దానవ బాలురకు విష్ణు మహిమనుపదేశించెను. గురువులకు తత్త్వోపదేశము చేసెను. గురువులు కోపించి కృత్యను ప్రహ్లాదునిపై ప్రయోగించిరి. ఆ కృత్యబారినుండి ప్రహ్లాదుడు గురువులను రక్షించెను. హిరణ్యకశిపుడు మరల ప్రహ్లాదుని అనేక విధముల బాధింప జొచ్చెను. ప్రహ్లాదుడు తండ్రికిని తత్త్వోపదేశమును చేసెను. హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని నాగపాశములచే బంధించి సముద్రములో త్రోయించగా నతడు సురక్షితముగ తీరమున కేతెంచెను.

పంచమాశ్వాసము :-

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పిలిపించెను. శుక్రాచార్యుడు, ప్రహ్లాదుని ప్రబోధింపగా నతడు విష్ణుభక్తి మహిమ నెఱిగించెను. హిరణ్యకశిపుడు కుమారుని బాధింప యముని పంచెను. విష్ణు కింకరుల ధాటికి యమకింకరులు తొలగిరి. హిరణ్యకశిపుడు భయముతో దాగెను.

4. ఎఱ్ఱన : హిరణ్యకశిపుని భార్య కలగాంచినది. ఆ స్వప్నఫలమును గూర్చి శుక్రాచార్యుని ప్రశ్నించినది. కల వృత్తాంతము భాగవతమునలేదు.

5. ఎఱ్ఱన : బృహస్పతి ఇంద్రునకు నారాయణమంత్ర మహిమను చెప్పినట్లు విస్తృతముగా వర్ణింపబడినది ఇది భాగవతమున లేదు. హిరణ్యకశిపుడు భార్యాసహితుడై ఉద్యానవన విహారము మధుపానక్రీడ విష్ణు పురాణము ననుసరించి రచించెను. పోతన మధుపానక్రీడాసక్తుడై భార్యతో విహరించెనని స్వల్పముగా చెప్పెను

6. ఎఱ్ఱన : కేశవ పక్షపాతియైన ప్రహ్లాదుని సన్మార్గమున పెట్టుటకు ఒక క్రమము ననుసరించి శిక్షలు విధించుచు ప్రహ్లాదునిలో పరివర్తనము గమనించు చున్నట్లు కలదు. ఇది విష్ణుపురాణము ననుసరించి సాగినది. ఇది భాగవతమున లేదు. మొత్తముమీద నృసింహపురాణము వర్ణనా మహనీయమై ప్రబంధాభిముఖముగ సాగినది. భాగవతమందలి ప్రహ్లాదుని చరిత్ర కథనాత్మకముగా సాగెను.

## నృసింహ పురాణమునకు మూలము

ఎఱ్ఱన నృసింహ పురాణావతారిక యందు తన గ్రంథమునకు మూలములను గూర్చి ప్రస్తావించెను.

బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీ నరసింహావతారంబను పురాణంబు తెనుంగుబాసఁబ్రకటింపవలయు. 1 నృసింహ-పీ-27

ఏనును బెద్దలచే మును
వీనులలరఁ దర తరంబవిన్న విధంబున్
మానసముననున్న తెరఁగుఁ
గానుపునం గన్న క్రమము గథన మొనర్తున్. 2 నృసింహ-ప్ర-24

పరిశీలనము చేసినచో శంభుదాసుని నృసింహ పురాణమునకు మూలగ్రంథములు 1. సంస్కృత భాగవతము 2 విష్ణుపురాణమునని చెప్పవచ్చును. అటనట హరివంశ పద్మపురాణ, కూర్మపురాణములలోని అంశములు గ్రహించినట్లు చెప్పనగును.

బ్రహ్మాండ పురాణము :-

ఇందు ప్రహ్లాద చరిత్ర చాల సంక్షిప్తముగా ఉన్నది.

తీసికొని పోవుచుండగా నారదుడు వారించి తన తల్లిని తన ఆశ్రమమునకు తీసికొని పోయి విష్ణుభక్తి బోధించినాడని, ఆఉపదేశ ఫలితముగా తనకు అజన్మ సిద్ధముగా విష్ణు భక్తి అలవడినదని చెప్పినాడు.

పుత్రుని హరిభక్తి కిట్టక హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని హింసించి తుదకు నృసింహమూర్తిచే సంహరింపబడెను. విష్ణుమూర్తి రాక్షస రాజ్యమునకు ప్రహ్లాదుని పట్టాభిషిక్తునిగ నొనరించెను.

## నృసింహ పురాణ కథకు, పోతన భాగవతమందలి ప్రహ్లాద చరిత్రకు కల భేదములు

1. ఎఱ్ఱన నృసింహపురాణమున గాలవుడను మునీశ్వరుడు ప్రశ్నింపగా దేవశర్మ అహోబల నరసింహదేవుని మాహాత్మ్యమును తెలిపెను.

పోతన ప్రహ్లాదచరిత్రమున ధర్మరాజు రాజసూయ యాగము చేయుచో శిశుపాలుడు శ్రీకృష్ణుని నిందించెను. తత్ఫలితముగా శిశుపాలుడు శ్రీకృష్ణ చక్రముచే ఛిన్నమస్తకుడై శ్రీకృష్ణునిలో లీనమయ్యెను, ధర్మరాజు, పుట్టినప్పటినుండి పాపాసక్తుడగు శిశుపాలుడు శ్రీకృష్ణునిలో లీనమగుట ఆశ్చర్యముగా నున్నదని ప్రశ్నించెను. నారదమహర్షి ఆ సమయమున శిశుపాలదంతవక్త్రుల కథను చెప్పుచు హిరణ్యకశిపుని కథ చెప్పెను.

2. ఎఱ్ఱన హరి, తిమి కమఠ వరాహావతారముల పిమ్మట యోగనిద్రచెంది మేల్కాంచినట్లు తరువాత జయవిజయులు సనక సనందనాదులచే శపింపబడి హిరణ్యకశిపు, హిరణ్యాక్షులుగా జన్మించినట్లున్నది. యోగనిద్ర విషయము భాగవతమున లేదు. వరాహావతారమైన పిమ్మట నృసింహావతారమని భాగవతము. నృసింహ పురాణమున హిరణ్యకశిపుని భార్యపేరులేదు. ఆమె పేరు లీలావతి అని వ్యవహార మున కలదు పోతన వాడిన లీలావతీ శబ్దము సంజ్ఞయన్న భ్రాంతి ఈవ్యవహారమునకు కహేతువు. మూలము. హిరణ్యకశిపుని భార్యపేరు లీలావతికాదు;

3. పోతన హిరణ్యకశిపుడు తపస్సు చేయబోయినపుడు ఇంద్రుడు అతని భార్యను అపహరించుకొని పోవుచుండగ నారదుడు అతనిని మందలించి ఆమెను తన ఆశ్రమమున సంరక్షించెను. నారదోపదేశమున గర్భస్థుడైన శిశువునకు విష్ణుభక్తి అజన్మ సిద్ధమైనది అని చెప్పబడినది.

యత్ర చాద్యః పుమానాస్తే
భగవాన్ శబ్దగోచరః
సత్త్వం విష్టభ్య విరజం
స్వానాం నో మృడయన్వృషః
యత్రనైశ్శ్రేయసం నామ
వనంకామదుఘైర్ద్రుమైః
సర్వర్తుశ్రీభి ర్విభ్రాజత్
కైవల్యమివ మూర్తిమత్
వైమానికా స్సలలనా శ్చరితాని యత్ర
గాయంతి లోకశమల క్షపణానిభర్తుః
అంతర్జలనువికస న్మధు మాధవీనాం
గంధేన ఖండితధియోఽ ప్యనిలం క్షిపంతః
పారావతాన్యభృతసారసచక్రవాక
దాత్యూహహంసశుకతిత్తిరిబర్హిణాం యః
కోలాహలో విరమతేఽ చిరమాత్రముచ్చై
ర్భృంగాధిపే హరికథా మివగాయమానే
ఆపుః పరాం ముద మపూర్వ ముపేత్య యోగ
మాయాబలేన మునయ స్తదథో వికుంఠమ్ 4

4. స్కం-3-అ-15 శ్లో 14-26

ఎత్తిన పైశ్లోకములననుసరించి కథ నడిపినాడు.

తాభ్యామ్మిషత్స్వ నిమిషేషు నిషిధ్యమానా
స్స్వర్హత్తమాహ్యపి హరేః ప్రతిహారపాభ్యామ్
ఊచుః సుహృత్తమ దిదృక్షితభంగఈషత్
కామానుజేన సహసా త ఉపప్లుతాక్షః
మునయఊచుః
కోవామిహైత్య భగవత్పరిచర్యయోచ్చై

ఉపోద్ఘాతపాదః

హిరణ్యకశిపు ర్దైత్య శ్చచార పరమాతపః
శతం వర్ష సహస్రాణాం నిరాహారో హ్యధః శిరాః
వరయామాస బ్రహ్మాణం తుష్టం దైత్యో వరేణతు
సర్వామరత్వ మసుఖం సర్వభూతేభ్య ఏవహి
యోగాద్వైరాన్ వినిర్జిత్య సర్వ దేవత్వ మాస్థితః
తతః కృతా యుద్ధేన దైత్యేంద్రం తం మహా బలమ్
సర్వైర్భి ర్భేద సంక్రుద్ధో నార్సింహ వపుర్వా నఖానితి

తె. బ్రహ్మాండ పురాణము - ఆచార్య జగదీశశాస్త్రి 13-14-15-29

హిరణ్యకశిపుడు వేయి సంవత్సరములు ఘోరతపమాచరించి బ్రహ్మను మెప్పించి వరములను పొందెను. సర్వామరత్వము, సర్వభూతములచే అవధ్యత్వమును బడసెను. అస్త్ర శస్త్రములచేగాని దివారాత్రములందుకాని మరణములేకుండునట్లు వరము సాధించినాడు. బ్రహ్మ అతనికి కోరిన వరములిచ్చి వెడలినాడు. వరవాన గర్వోన్మత్తుడైన హిరణ్యకశిపుడు సర్వదిక్పాలుర రూపములను వహించి వెలిగినాడు. దేవాసురులందరు అతనికి మ్రొక్కిరి. హిరణ్యకశిపుడు ఏదిక్కు నకున్నచో ఆదిక్కున దేవతలు పడలి పోయిరి. ఆ హిరణ్యకశిపునకు మృత్యుకారణమైన శ్రీ మహా విష్ణువు, నరసింహమూర్తియై అస్త్రములు, శస్త్రములుకాని గోళ్లచేత అతనిని సంహరించినాడు. ఈపురాణమందు హరిభక్తుడైన ప్రహ్లాదుడు జన్మించుట, విష్ణు భక్తుడైన ప్రహ్లాదుని తండ్రి మానుమని హింసించుట జయ, విజయుల కథలు లేవు.

## సంస్కృత భాగవతము

జయ, విజయుల కథ :-

ఈ కథ మూల భాగవతమందు యజ్ఞ వరాహావతారమునకు పూర్వగాథగా తృతీయస్కంధమున నున్నది.

వసంతియత్ర పురుషాః
సర్వే వైకుంఠమూర్తయః
యేఽనిమిత్తనిమిత్తేన
ధర్మేణారాధయన్ హరిమ్

ఉ॥ కాపుస ధర్మ విద్విషులు కల్మషకారు లనంగ దుష్టమో
హావిల బుద్ధితో నసురలై జనియింపుడు సంతతంబు ల
క్ష్మీపతిమీఁది మచ్చరము కిన్కయుఁ గాఱియ బెట్టుఁ గాతమీ
భావము లిప్పుడే పగిది బాములు పెక్కగు నిక్కమెంతయున్

నృసింహ-ప్ర 89

భాగవతమున జయ, విజయులు చేసిన అపరాధమును గ్రహించి శ్రీమహా విష్ణువు వచ్చి సనకాదులను అనునయించిన ఘట్టమున్నది.

శ్లో॥ ఏతౌ హి పార్షదౌ మహ్యం జయో విజయ ఏవచ
కదర్థీ కృత్యమాం యద్వో బహ్వాధత్తా మతిక్రమమ్.
యస్త్వేత యోర్ధృతో దండో భవద్భిర్మా మనువ్రతైః
సఏవాను మతోఽస్మాభి ర్మునయో దేవహేళనాత్.
తద్వః ప్రసాదయామ్యద్య బ్రహ్మదైవం పరంహిమే
దద్ధిహ్యాత్మకు తంమన్యేయత్స్వపుంభి రసత్కృతాః
యత్సేవయా చరణ పద్మ పవిత్రరేణుం
సద్యఃక్షతాఖిలమలం ప్రతిలబ్ధశీలమ్
నాహంతథాద్మి యజమానహ విర్వితానే
చ్యోతద్ఘృతప్లుతమదన్ హుతభుజ్ ముఖేన సం॥భా-స్క. 3-16 8

ఇదంతయు ఎఱ్ఱనార్యుడు వర్ణించి యున్నాడు మూలమున జయ, విజయులు ప్రతి శాపమొసంగ సమర్థులయ్యును భాగవతాపచారము భగవత్ప్రీతికరము కాదని క్షమవహించినట్లు వర్ణించుట సముచితముగా నున్నది. బ్రాహ్మణప్రభావము విస్తృతముగ వర్ణితము.

హిరణ్యకశిపుని తపస్సునకు కారణము నృసింహపురాణమున భాగవతముకంటె భిన్నముగా ఉన్నది. భాగవతమున హిరణ్యాక్షునివధ పిమ్మట హిరణ్యకశిపునివధ జరిగినట్లున్నది. కాని నృసింహపురాణమున హిరణ్యకశిపుని వధానంతరము హిరణ్యాక్షునివధ జరిగినట్లున్నది.

మునుల తీవ్రపుశాపమునఁజేసి మత్ప్రతి
హారులు దితిసూనులై జనించి
రందగ్రజుఁడు హిరణ్యకశిపుఁడభిహతుఁ
డయ్యె హిరణ్యాక్షుఁడనుజుఁ డింక

స్తద్ధర్మిణాం నివసతాం విషమ స్వభావః
తస్మిన్ ప్రశాంతపురుషేగతవిగ్రహేవాం
కోవాఽఽత్మవత్ కుహకయోః పరిశంకనీయః
నహ్యంతరం భగవతీహాసమ స్తకుక్షా
వాత్మాన మాత్మని నమో నభసీవ ధీరాః
పశ్యంతి యత్రయువయోః సురలింగినోః కిం
వ్యుత్పాదిత హ్యుదరభేది భయంయతోస్య
తద్వామముష్యపరమస్య వికుంఠభర్తుః
కర్తుం ప్రకృష్టమిహ ధీమహి మందధీభ్యామ్
లోకానితో వ్రజత మందరభావ దృష్ట్యా
పాపీయసస్త్రయ ఇమే రిపవో స్యయత్ర.

5 భాగ-స్క. 3-అ. 15-32 34

ఈ శ్లోకములను చదివి ప్రభావితుడై ఎఱ్ఱన వైకుంఠ పురవర్ణనమును, సనకాదులను జయ విజయుల డ్డగించుట, వారు కోపోద్రిక్తులై జయ, విజయులను శపించుట మొదలగు విషయములను రచించెను. వనజభవనందనులు సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అను మునివరులు ముకుందదర్శన వాంఛతో వైకుంఠమున కేగుదెంచునప్పుడు జయ విజయులు వారిని ఒకింత తడవు వేచియుండుడని చెప్పిరి.

అనుటయు నాడి దేవుఁ బరమాత్ము గనుంగొన నెమ్మనంబులన్
మొనయుకుతూహలాంకురము మోడ్పడఁ గోపముచిచ్చు
తాఁకునన్, ఘనతరబోధపల్లవము గందఁగసైరణ యన్మహా
వ్రతంబునకు విఘాత మొంద మునిపుంగవు లొక్కటన్నుగమూర్తులై.

తే. అఖిలలోకగమ్యు, డగుపరమేశ్వరుఁ
జూడఁ గొల్వ నబ్బుసుకృతమునకు
నంతరాయ మైతి రట్టియిద్దురితంబు
ఫలమువనుభవింపవలయు మీరు.

6, నృసింహ 1-87.88

ఈ వ్యత్యాసమునకు కల్పభేదము కారణమని ఊహింపవచ్చును. ఉదా. వాల్మీకి రామాయణము ననుసరించి కుంభకర్ణుని రాముడు వధించెను. భారతాంతర్గతమగు రామాయణమునందు కుంభకర్ణుని లక్ష్మణుడు వధించినట్లున్నది.

హిరణ్యకశిపుని తపస్సునకు వెఱచి ఇంద్రుడు మంత్రిమాణిక్యమగు బృహస్పతి కడకువెళ్ళగా ఆతడు ఇంద్రుని ఓదార్చి ఇట్లు చెప్పెను.

నీరజోదరుతోడి మాత్సర్యంబుగాఁ దలఁచు వారికి నేరూపంబున నిత్యోన్నతులు గలుగునేర్చునే ? విష్ణుద్వేషంబును నిరంతర దోషంబును శ్రుతిధర్మ విరోధంబును సుజన నిరోధంబును నసుర స్వభావంబులు కావున

నారాయణ విద్విషులకుఁ గ్రూరులకాయువును శ్రీయుగులము బలంబున్
బేరును బెంపును బోలియును ఘోరనరక కూపములను గూలుదురుతుదిన్

నృసింహ. ద్వి. 40-41

వీనికిమూలము భాగవతమున కలదు. తండ్రిమాట పాటింపుమని రాక్షస గురువులు బోధింపగా ప్రహ్లాదుడు విష్ణుమహిమ నెరిఁగించుట మొదలైనవన్నియు భాగవతసప్తమ స్కంధమునుండి అనువదించెను.

ప్రహ్లాదుని విష్ణుభక్తి విని హిరణ్యకశిపుడు మండిపడి స్తంభమును అరచేతితో కొట్టి ఇందువిష్ణువున్నాడా అను ఘట్టమునకూడ ఎఱ్ఱన భాగవతమునే అనుసరించెను.

ఏవం దురుక్తైర్ముహురర్దయన్‌రుషా
సుతం మహాభాగవతం మహాసుర :
ఖడ్గం ప్రగృహ్యోత్పతితో వరాసనాత్
స్తంభం తతాడోరుబలః స్వముష్టినా
తదైవ తస్మిన్ నినదోఽతి భీషణో
బభూవ యే నాండకటాహ మస్ఫుటత్
శ్రుత్వా స్వధా మప్యయమంగ మేనిరే
అభిక్రమన్ పుత్రవధేప్సు రోజసా
నిశమ్య నిర్హాదనుపూర్వముద్భుతమ్ భాగ. స్కం. సప్తమ అ. 8 శ్లో 15-17

ఈ శ్లోకములను మాతృకగా చేసికొని ఎఱ్ఱన

నాడి వరాహరూపాస్మదీయోగ్రితే
జంబుచేతన యుపశాంతి బొందు
వినుము త్రేతాయుగంబున వీర రావణ
కుంభకర్ణాఖ్య రక్షోవరేణ్యు
లై సముద్భవ మందుదు రపుడు నేను
నవతరించి జయింతు మూడవయుగంబు
నందు శిశుపాలదంతవక్త్రాఖ్యబుట్టి
పడయుదురు వీరు మద్భావ భవ్యపదము నృ. పం-147

దశావతారక్రమము

మత్స్యకూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కి రేవచ

దీనినిబట్టి వరాహావతారము తర్వాత నృసింహావతారము జరిగినట్లు భాగవతము వలన తెలియుచున్నది. నృసింహపురాణములో వ్యత్యస్తమైనది. దీనికి మూలము కూర్మపురాణము. ఇందు హిరణ్యకశిపు వధానంతరము

స్వమేవ పరమంరూపం యయౌ నారాయణాహ్వయమ్
గతే నారాయణేదైత్యః ప్రహ్లాదోఽ సురసత్తమః
అభిషేకేణ యుక్తేన హిరణ్యాక్ష మయోజయత్
సబాధయామాస సురాన్రణే జిత్వామునీనపి
లబ్ధ్వాఽన్ధకం మహాపుత్రం తపసాఽ రాధ్య శంకరమ్
కూర్మ. షోడశ-74-75

దేవాం జిత్వా సదేవేంద్రాన్ క్షుబ్ధ్వాచ ధరణీ మిమామ్
నీత్వా రసాతలంచక్రే వేదాన్వైనిష్ప్రభాం తథా
తతః సబ్రహ్మకాదేవాః పరిమ్లానముఖశ్రియః
గత్వా విజ్ఞాపయామాసు ర్విష్ణవే హరిమందిరమ్.
సచింతయిత్వా విశ్వాత్మా తద్వధోపాయ మవ్యయః
దంష్ట్రయోద్ధారయామాస కల్పాదౌ ధరణీ మిమామ్
కూ. షోడశ-74-83

యజ్ఞభాగానదేషాంస్తుసస్వయం బుభుజేఽసురః
దేవాః స్వర్గం పరిత్యజ్యత్రాసా న్మనిస త్తమ
విచేరు రవనౌ సర్వేబిభ్రాణా మానుషీంతనుమ్
జిత్వాత్రిభువమ్ సర్వం త్రైలోక్యైశ్వర్యదర్పితః
ఉపగీయమానో గంధర్వైర్బుభుజే విష యా న్ప్రియాన్
నృ. పు. అ. 1 శ్లో. 2-6

ఈ శ్లోకమును ఎఱ్ఱన ఆంధ్రీకరించెను.
జముండై తాన సమస్తకర్మ గతులన్ శాసించు శీతంబు నూ
ష్మము వర్షంబును దాన యయ్యొయితఱిన్ సంధిల్లగాఁజేయు స
ర్వము గామంబును దాన కైకొని ప్రమోదం బందు ధర్మంబు మో
క్షము నాత్మీయకటాక్షలక్ష్యము లనన్‌గర్వోత్కటస్ఫూర్తుడై
నృసింహ. 2-132

నేలయుఁ గొండలున్ దిశలు నింగియు దీవులు నంబురాశులున్
గాలములున్ గ్రియావళులు గాడ్పులు వహ్నులు నాకమర్త్యపా,
తాళములు న్నిజాకృతులు దాల్చి సరోరుహసూతి గొల్చున,
ట్లాలఘుశీలుఁ గొల్వ సదయాత్మతయేర్పడ వచ్చు నిచ్చలున్.
నృ పు 1-179

ఈ భాగము పిమ్మట విష్ణు పురాణములో ఉన్నట్లే హిరణ్యకశిపుని ఉద్యానవన విహారము, మధుపాన లీలావర్ణనము చేసినాడు. శ్లోకములను పరిశీలించినచో తేట తెల్లమగును.

పానాసక్తం మహాత్మానం హిరణ్యకశిపుం తదా
ఉపాసాం చక్రిరే సర్వే సిద్ధ గంధర్వపన్నగాః
అవాదయన్ జగుశ్చాన్యే జయశబ్దం తథాపరే
దైత్యరాజశ్చ పురత శ్చక్రుః సిద్ధా మదాన్వితాః
తతప్రవృత్తా ప్సరసి స్ఫాటికాభ్రమయేఽసురః
పపౌపానం ముదాయుక్తః ప్రాసాదే సుమనోహరే

ఇట్లు ఉదధిపునొద్ద విశ్వావసు తుంబురులును వీణా వేణు మృదంగ సంగత కళా విన్యాసమున్ మొదలయిన పద్యములలో ఎఱ్ఱన మధుపాన క్రీడను విస్తారముగా వర్ణించినాడు. ఇట్లు మదిరాపాన గోష్ఠి సమయమున అనేక విలాసినీ పరివృతుడై

అనపుడు రోషహాసవివృతాననుఁడై దివిజారి యొరసీ
వనయము నెందుఁగల్గఁగ సమర్థనఁ జేసెయాతఁ డిందుఁ గ
ల్గునె యనుచున్ జగద్వలయఘోరకరాహతిఁ వేసెఁ గంబ మ
త్యనుపమతత్ప్రభావన మల్లల నాడఁ గలంగ లోకముల్.

సీ. బడబానలాహతి జడనిధిలో నున్న
పటుశైలతతి ప్రేలి పెటిలె నొక్కొ
ఘనతరోత్పాతనిర్ఘాత సహస్రంబు
గడఁగి యొక్కట మ్రోసి పడియె నొక్కొ
పెక్కుజీవులులోన నిక్కట్టుపడఁగ నా
బ్రహ్మాండభాండంబు పగిలె నొక్కొ
తతిగాకయున్న నుద్ధతిఁ బేర్చి రుద్రుండు
విలయోగ్రపటలంబు వ్రేసెనొక్కొ

గీ. యనఁగ నాకాశసకల దేశావకాశ
భరితమై విశ్వమును మూర్ఛపాలుపడఁగ
మొనసిపెడిలు పెడ్లను మ్రోతవెడలఁ
బగిలెఁ గంబంబు భువనకంపంబు గదుర. నృసింహ. పంచమ. 79-81

నరసింహమూర్తి ఆకారవర్ణనమునకు, హిరణ్యకశిపుని పట్టిచీల్చిన విధమునకు ఆధారము సంస్కృత భాగవతమే. తరువాత భాగవతములో ఋషిపుంగవులు చేసిన స్తోత్రమును అనువదింపక ఎఱ్ఱన ఒక దండకమును చక్కగా రచించెను. కథా సమాప్తమున పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు వరముల కోరనొల్లక కేవలము శ్రీహరి యందే సంలగ్నచేతస్కుడైనాడు.

## విష్ణుపురాణము :

హిరణ్యకశిపుని విజయములు విష్ణుపురాణమునందు సూక్ష్మముగా వర్ణింపబడినవి. వీనిని ఎఱ్ఱన ప్రపంచించినాడు. అవి హాస్యాభ్యాసములు.

త్రైలోక్యం వశమానిన్యే బ్రహ్మణో వరదర్పితః
ఇంద్రత్వమాకరోద్దైత్యః సచాసీ త్సవితా స్వయమ్
వాయు రగ్ని రపాంనాథః సోమశ్చా భూన్మహాసురః
ధనానా మధిపః సోऽభూ త్స ఏవాసీ త్స్వయం యమః

దెవ్వానివలనన యెంతయు సంభవ,స్థాన సమూహోదళలం జెందుం
గాకణంబుల కెల్లఁగారణంబై యెవ్వఁ, డపగతకారణుండై వెలుంగు
గీ. నమ్మహాను భావు నమ్మతు నవి కారు,నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించి నాఁడ నధిప యింతయ కాక, యితరమైన యర్థమెఱుఁగనేను.

చతుర్థాశ్వాశమునందే వర్ణింపబడిన హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని పెట్టిన బాధలు పాముల నుసిగొల్పుట, ఏనుగుల త్రొక్క బంపుట, ప్రహ్లాదుడు రాక్షసబాలురకు ఉపదేశము చేయుట, హిరణ్యకశిపుడు ప్రహ్లాదునకు విషము పెట్టించుట, గురువులు కృత్యను పుట్టించి ప్రహ్లాదుని పైకి పంపుట మొదలైన భాగములన్నియు విష్ణుపురాణము నుండి ఎఱ్ఱన అనువదించెను. పంచమాశ్వాసమున ఎఱ్ఱన తాతమాట ప్రకారము శ్రీమదహోబల స్వామి క్షేత్రమాహాత్మ్యము వర్ణించెను. దీనికి స్థలపురాణమే మైన యున్నదేమో! శ్రీదేవి ఆవిర్భవించుట, బ్రహ్మాదులు నరసింహమూర్తిని స్తుతించుట పద్మపురాణమునుండి ఎఱ్ఱన గ్రహించెను. వాల్మీకి, కాళి దాసాదుల ప్రభావము కొన్ని వర్ణనములలో గుర్తింపవచ్చును. హిరణ్యకశిపుని ఘోరతపస్సు వాల్మీకి రామాయణోత్తర కాండలోని రావణుని తపస్సును, కాళిదాస కుమారసంభవమందలి పార్వతి ఆమూఋతువులలో చేసినతపస్సును ఆధారముగ చేసికొని ఎఱ్ఱనవర్ణించినాడు.

21. నృ. చతుర్థ- 7

# 3. ఎఱ్ఱన అనువాద పద్ధతి – పోతన అనువాద పద్ధతి, తారతమ్యము

## పోతన – అనువాద విధానము :

శ్రీభాగవతపురాణము సహస్రదళ పద్మము. ఆ పద్మములో ప్రహ్లాదచరిత్ర భక్తిమకరంద మాధుర్యముతో జాలువారు దళము. భారతము కవిత్రయముచేతిలో బంగారు పంటలు పండినది. తెలుంగుల పుణ్యఫలముగా పోతన చేతియందు భాగవత మందార మకరందము ప్రవహించినది.

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విన్ బురాణావళుల్
తెనుఁగుస్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో
తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెద ( బునర్జన్మంబు లేకుండగన్

హిరణ్యకశిపుడు ఇంతకాలముఁ గురువులు దగ్గర నేర్చుకొనిన విద్య యందలి సారమును చెప్పుమని ప్రహ్లాదుని ప్రశ్నించెను. ఆ సందర్భమున కూడ ఎఱ్ఱన విష్ణు పురాణమునే అనుసరించినాడు.

నశబ్దగోచరం యస్య యోగిధ్యేయం పరంపదమ్
యతో యశ్చ స్వయం విశ్వం స విష్ణుః పరమేశ్వరః

హిరణ్యకశిపు రువాచ

పరమేశ్వర సంజ్ఞోఽజ్ఞ కి మన్యో మయ్యవస్థితే
తథాపి మర్తు కామ స్త్వం ప్రబ్రవీషి పునః పునః

ప్ర. ఉ. నకేవలం తాత మమ ప్రజానాం సబ్రహ్మ భూతో భవతశ్చ విష్ణుః
ధాతా విధాతా పరమేశ్వర శ్చప్రసీద కోపం కురుషే కిమర్థమ్.

హి. క. ఉ ప్రవిష్టః కోఽస్య హృదయేదుర్బుద్ధే రతిపాపకృత్
యే నేదృశాన్యసాధూనివద త్యావిష్టమానసః

ప్ర. నకేవలం మద్ధృదయం సవిష్ణురాక్రమ్యలోకా నఖిలా నవస్థితః
సమాంత్వమాదీం శ్చ పిత స్సమస్తా నమ స్త చేష్టాను యున క్తి సర్వగః

ప్ర. యతఃప్రధాన పురుషౌయతశ్చై తచ్చరాచరమ్
కారణం సకల స్యాస్య స నోవిష్ణుః ప్రసీదతు

వి. పు. - శ్లో 17_30

ఈ శ్లోకములను యథాతథముగ ఎఱ్ఱన అనువదించెను.

ఉ. పాపడ యింత కాలమును బాయకయొజ్జల యొద్దనుండి నీ
వేపగిదిన్ బఠించి తడి యేర్పడఁ బ్రస్ఫురితార్థసార మై
తీపులు వీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్కటి
ద్దీపితధీ విజృంభణ విధేయత యొప్ప నుపన్యసింపుమా.

నృ. చతుర్థ 5-7

క. అనుపయుఁ బ్రహ్లాదుండి, ట్లనియెను నేయానతిచ్చినట్టిద యయ్యా
వినిపించెద నామది మెచ్చిన యర్థం బవధరింపు చిత్తప్రీతిన్.

సీ. ఆదియు మధ్యంబు నంతంబు నెవ్వాని, కరయలేదని చెప్పు నాగమములు
పొడమటయును లేక పొదలుటయును లేక
తఱుగుటయును లేక తనరు నెవ్వ

శ్లో॥ యథావైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్
నతథాభక్తియోగేన ఇతిమే నిశ్చితామతిః    సం॥ భా॥ 7-1 29

పై శ్లోకమును తన్మయతామియాత్ అనునది చేరుట అను క్రియతో సరిపెట్ట బడినది. మూలములోని భావము కందపద్యమున అందముగ అమరినది. ప్రపంచ సాహిత్యములో వైరముచే పరమేశ్వర సాయుజ్యము పొందుట నాస్తికతో దర్శనీయము. ఈ సూత్రమునకు వాఖ్యానమే ప్రహ్లాద చరిత్ర.

ఇచటనే విష్ణుభావనా శక్తిని ప్రబోధించుచు నారదమహర్షి ధర్మరాజుతో ఇట్లనెను.

శ్లో॥ తస్మాద్వైరానుబంధేన నిర్వైరేణభయేనవా
స్నేహత్ కామేనవా యుంజ్యాత్ కథంచి న్నేక్షతే పృథక్
సం॥ భా॥ 7-1-28

దీనికి యథామూలముగ పోతన చిన్న ఆటవెలది పద్యములో అనువదించెను.

ఆ॥ అలుకనైన జెలిమినైన కామంబుననైన బాంధవముననైన భీతి
నైన దగిలి తలప నఖిలాత్ముడగు హరి జేరవచ్చు వేరుసేయ డతడు.
తె భా. 7-14

మూలములో లేని అఖిలాత్మకుడగు హరి అనుట భావ సౌందర్యమునకు పోషకము. నేక్షతేపృథక్ అనునది వేరుచేయడు అనుట చక్కగా అతికినది. మూలము లోని అలంకారము పోతన యిట్లు చక్కగా అనువదించెను.

శ్లో॥ కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్
సంరంభ భయయోగేన విందతే తత్స్వరూపతామ్.   సం భా. 7-1-30.

కం॥ కీటకము దెచ్చి భ్రమరము పాటవమున బంభ్రమింప భ్రాంతంబై తత్
కీటకము భ్రమరరూపము బాటించి వహించుగాదె భయయోగమునన్

మూలములోని సంరంభః అనుదానికి భ్రాంతమై అని పోతన అనువదించినాడు. సంరంభః ద్వేషః అని శ్రీధరీయము. భ్రమరము కీటకమును తెచ్చి గూటిలో పెట్టినప్పుడు భయము, ద్వేషము కలిగియుండుట సహజము. తమను స్మరన్ అనునది విడిచిపెట్టబడినది హిరణ్యకశిపుడు హరిద్వేషముచే మోక్షము పొందెనను సందర్భము లోనిది గాన ద్వేషముండుట యుక్తము. భక్తిమార్గమునకు ఆయువు పట్టైన శ్లోకము.

సమ్యక్పరిశీలనముచేసినచో పోతన అనువాదము కవిత్రయానువాదము కంటె భిన్నమైనది.

1. స్వతంత్రానువాద పద్ధతి

ఇతిహాసపురాణములు కథాప్రధానములగుటచే స్వతంత్రానువాద పద్ధతియే వీనిపట్ల ననుసరణీయము. నన్నయాదులు స్వతంత్రానుపద్ధతినే యనుసరించిరి. పోతన అనువాదము చేయుచు తదనువాద పద్ధతినే యనుసరించెను. కాని కవిత్రియము అవలంబించిన స్వాతంత్ర్యము కథలను పరిత్యజించుటవరకు పోయినది. పోతన మూలకథలను వేనిని విడిచిపెట్టలేదు. మూలకథను అధునికులు చెప్పుసంకలన పద్ధతితో నందగింపచేసెను.

2. మక్కీకి, మక్కి అనువాదము ఎవరునుచేయలేరు. అనగా మూలములోని పదములన్నియు అనువాదములో వచ్చుటకు ప్రయత్నించుట నీరసమైనపద్ధతి.

3. మూలనిరపేక్షముగ అనువాదము చదువుచున్నపుడు వ్యాఖ్యానపంక్తులను ఆధారముగా చేసికొని మూలభావము తేటపడునట్లు వివరణాత్మకముగ చెప్పుట. అనువాదము చదువుచున్నప్పుడు సహృదయుడు ఇది స్వతంత్రగ్రంథమా అను అనుభూతిపొందుట ప్రధానము.

4. పోతన విష్ణుభక్తుడు. ఆభక్తకవి, ప్రహ్లాదాంబరీష గజేంద్ర రుక్మిణ్యాది పాత్రలతో తాదాత్మ్యము పొందెను. అట్టిపట్టులలో మూలములో రేఖామాత్రముగనున్న విషయమును పోతన హృదయసంవాదమయిన పట్టుల ప్రపంచించి రమణీయముగ తీర్చిదిద్దెను. ఇతని పరమ రమణీయమైన అనువాద విధానమునకు ఉజ్జ్వల మణి దర్పణము ప్రహ్లాదచరిత్ర. పోతనార్యుడు తనకు అత్యంత ఆత్మీయమైన భక్తితో తన్మయుడై భక్తిమకరందమును ప్రహ్లాదుని ముఖాంబుజమునుండి ప్రవహింపజేసెను. ప్రహ్లాదచరిత్ర దివ్యప్రబంధము.

## యథామూలానువాదము

భాగవతమున సప్తమస్కంధమందలి ప్రహ్లాదచరిత్రలో పోతన ఆంధ్రీకరణవిధానము శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శనము వలె బహుగుణ రమణీయమై సాగినది. అందలి ప్రతిపదము భక్తిసురభిళము.

కం॥ వైరానుబంధనంబునఁ జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిన్
జేరఁగరాదని తోఁచును, నారాయణభక్తియుక్తి నాచిత్తమునన్

దీనికి మూలమిది.

మూలమున రేఖామాత్రముగనున్న సూక్ష్మాంశములు తూలికోన్మీలనమైన కమనీయమైన చిత్రమువలెను, పోతన క్రమకపితా వర్ణికోద్భవమైన చిత్రవర్ణ రంజితమైన హరివిల్లువలెను ప్రకాశించినవి. వ్యాసమహర్షి ప్రహ్లాదుని రేఖాచిత్రమును మాత్రముపరిచయము చేసెను.

శ్లో॥ బ్రహ్మణ్యశ్శీల సంపన్నస్సత్యసంధో జితేంద్రియః
ఆత్మవత్సర్వభూతానామేకః ప్రియసుహృత్తమః
దాసవత్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః
భ్రాతృవత్సదృశస్నిగ్ధో గురుష్వీశ్వరభావనః సం. భా. 7-31-32 శ్లో

సీ॥ తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబుగ జరగువాఁడు
పెద్దలఁబొడగన్న భృత్యునికైవడి
జేరిసమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృభావముసేసి మరలువాడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులగావఁజింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు దైవతములంచు గురువుల దలఁచువాడు
లీలలందును బొంకులు లేనివాడు లలితమర్యాదుడైన ప్రహ్లాదుడధిప
తె. భా. 7-115

మూలమునందున్న ఒక్కొక్క విశేషణము పోతన ఒక్కొక్క సీసపాదముగ మలచినాడు. "ఆత్మవత్ సర్వభూతానామ్" అనునది తనయందు- పాదమైనది. దాసవత్సన్నతార్యాంఘ్రిః అనునది పెద్దలపొడగన్న- అనుపాదమైనది. మూలములోనిది కేవలము భావము. తెలుగులోనిది మనోహరభావ చిత్రణము. తెలుగుపద్యము చదువుగనే ప్రహ్లాదుడు, పెద్దలనుచూచిన వెంటనే భృత్యునివలె దగ్గరకుచేరి నమస్కరించుట మనకు సాక్షాత్కరించును. శీలసంపన్నః జితేంద్రియః, అను రెండును కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన మాతృభావనచేసి మరలువాడు, అనురీతి నమువదింపబడినవి. ఇట ఒక శంక కలుగుచున్నది. ప్రహ్లాదుడు, ఆనాటికి పంచాబ్దములవాడు. పంచశరద్వయస్కుడు (ఐదేండ్లప్రాయమువాడు) పరకాంతాపరాఙ్ముఖుడని చెప్పుటసందర్భోచితమా ? దీనికి ఈవిధముగ సమాధానముచెప్పి సరిపెట్ట నగును. మూడేండ్లనాడు

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత ముత్తమమ్. సం॥ భా॥ 7-5-23

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బనునీ తొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్ర మంచు దలతున్ సత్యంబుదైత్యోత్తమా. 7-167

## మూలమును పెంచిన భాగములు

పోతన రసపోషణము కొరకు పాత్ర సంభాషణాచాతుర్యము పోషించుట కొరకు భక్తిని చెప్పు పట్టులందు మనోహరముగా పెంచి స్వకపోల కల్పనా సామర్థ్యము ప్రకటించెను. హిరణ్యకశిపుడు సోదర మరణమునకు కడు దుఃఖితుడై తల్లిని, హిరణ్యాక్షుని భార్యలను ఓదార్చెను. అప్పుడు సందర్భోచితముగా సుయజ్ఞుని చరిత్రను చెప్పెను. అందు సుయజ్ఞుని శత్రువులు సంహరించిరి. ఆతని భార్యలు భర్తశవముపైబడి రోదించు ఘట్టమును పోతన కరుణరస నిర్భరముగా రచించెను.

శ్లో॥ ఉశీనరేంద్రం విధినా తథాకృతం పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః
హతాస్మనాథేతి కరైరురో భృశం ఘ్నంత్యోముహు స్తత్పదయోరుపాపతన్.

శ్లో॥ రుదంత్య ఉచ్చైర్దయితాంఘ్రిపంకజం
సించంత్యఅస్రైః కుచకుంకుమారుణైః
విస్రస్తకేశాభరణాః శుచం నృణాం సృజంత్యఆక్రందనయా విలేపిరే.
సం. భా. 7-2-31-32

ఉశీనరేంద్రుడు మరణించిన విధమును మూలానుగుణముగ=చారు భీషణముగ వర్ణించెను.

శా॥ స్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాచిమోదికొనుచున్ హానాథయంచున్నృపు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశుపాదాలపై
నస్తోకస్తన కుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షించుచున్ తె. భా-7-42

క. ఇందుఁగల డందులేదని సందేహము వలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే కలఁడు దానవాగ్రణి! వింటే తె. భా. 7 275

## స్వేచ్ఛానువాదము :

మూలశ్లోకభావములను గ్రహించి అందలి పదవాక్యములను యథాతథముగ అనువదించవలెనను ఉద్దేశముతోగాక, అవసరమైన మార్పులుచేసి స్వతంత్రించి రచించుట కొన్నిచోట్ల జరిగెను. దానికి ఉదాహరణము:

శ్లో. "అహో అమీషాం వయసాధికానాం విపశ్యతాం లోకగతిం విమోహః
యత్రోద్భవ స్తత్రగతం మనుష్యం స్వయం సధర్మా అపిశోచంత్యపార్థమ్"
సం. భా. ద్వి - 36

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రపు జోద్యము దేహిపుట్టుచున్
జచ్చుచునుండఁ జూచెదరు చావకమానెడి వారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు చావున కొల్లక డాగవచ్చునే
యెచ్చటబుట్టు నచ్చటికి నేగుట సైజము ప్రాణికోటికిన్ తె భా. 7-46

చావబోవువారు చచ్చినవారి కొరకు ఏడ్చుట శోచనీయమని పోతన చక్కగా స్వేచ్ఛానువాదము చేసినాడు.

శ్లో. పరోఽప్యపత్యం హితకృద్యథౌషధం
స్వదేహజోఽప్యామయవత్సుతోఽహితః
ఛింద్యాత్తమంగం హి యదాత్మనోహితం
శేషం సుఖంజీవతి యద్విసర్జనాత్. సం. 7-5-37

శా. అంగవ్రాతములో జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీయజ్ఞున్ గులద్రోహి దు
స్సంగున్ గేశవ పక్షపాతి నధమున్ ఖంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతి జరించెదన్ కులము నిర్దోషంబు గావించెదన్ తె భా. 7-188

మూలశ్లోకమును శార్దూలపద్యములో పోతన ధారాశుద్ధిగ అనువదించినాడు. నేటికి నేరము చేసినవారికి ఉచిత దండనము విధించవలెనన్న సందర్భమున ఈ పద్యము ఆంధ్రులు ఉటంకించెదరు.

నరసింహుడు స్తంభమునుండి ఉద్భవించి, హిరణ్యకశిపుని సంహరించినవిధము మూలములోసంక్షిప్తముగానున్నది. ఇచటపోతన దీర్ఘమైన స్తంభోద్భవ గద్యవీరబీభత్స

లేనిది ముప్పదేండ్లకు వచ్చునా ? పువ్వుపుట్టగనే పరిమళించునుకదా ? ప్రహ్లాదుడు బాల్యములోనే ఇంతసౌశీల్యముతో శోభించుచుండగా యౌవనమున ఇంకెంత సౌశీల్యముతో ప్రకాశించునో అనిజనులు తమలోతాము అనుకొనుచున్నారనుట సముచితము. పోతన తరువాతిపద్యములోకూడ ప్రహ్లాదుడు "కామినీప్రముఖభోగములెన్ని గల్గిన వ్యసనసంసక్తినా వంకబోడు" తె 11-7-117

అనిప్రయోగించి యున్నాడు. ఈనెరసు పోతన కవితా కళ్యాణగుణములలో మునిగిపోదా !

శ్లో॥ ప్రహ్లాద ఉచ్యతాం తాత స్వధీతం కించిదుత్తమమ్
కాలేనైతావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్ సం. భా7-5-22

హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని తొడమీద కూర్చుండబెట్టుకొని, ఏమిచదివితివి ? అని ప్రశ్నించెను. దానికి సమాధానము "శ్రవణం కీర్తనమ్" అని ఒకశ్లోకముమాత్రమే కలదు. ఈక్రింది పద్యములు పోతనపెంచి భక్తిశంఖమును పూరించినాడు.

క. చదివించిరి ననుగురువులు చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులునే
చదివినవి గలవు పెక్కులు చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ !

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ గృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ తె.భా. 7 166, 167 169

ప్రహ్లాదుని విద్యాభ్యాసవిషతో చదువునుగూర్చి పోతనగారి అభిప్రాయము.

క. చదువనివాఁడజ్ఞుండగుఁ జదివిన సదసద్వివేక చతురత గలుగుం
జదువగవలయును జనులకు జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ
తె భా. 7-130

ఈకారణములచే ఆర్యులొద్ద చదువుట కర్తవ్యము. అంతేకాదు చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ అనుటచే అధ్యాత్మవిద్యయే ఉపాదేయమను నది స్పష్టము. హరిభక్తిని ప్రబోధించు సర్వాంధ్రులకు సంభాషణమున ఈనాటికి మన చెవులకు విందుచేయు నీ పద్యము ఆమూలకము.

# 4. ఇతివృత్త నిర్వహణము

## ఎఱ్ఱన పోతనల కవితా తారతమ్య పరిశీలనము

### లక్ష్మీనృసింహపురాణము :

ఎఱ్ఱన, లక్ష్మీనరసింహావతారమును బ్రహ్మాండ, విష్ణు, భాగవత, హరివంశ, పద్మపురాణాదుల ననుసరించి, దివ్యప్రబంధముగ వినిర్మించెను. నన్నయ, తిక్కనల కవితారీతులనెడు గంగాయమునలలో ఎఱ్ఱన వర్ణనాత్మకరీతిని, సమ్మేళనముచేసి త్రివేణీ సంగమముగ మలచెను.

ఎఱ్ఱన, హరివంశము, రామాయణము, అరణ్యపర్వశేషములను, అనువదించెను. అచ్చట అతనికి స్వాతంత్ర్యము వహించుటకు అవకాశము తక్కువ. అందుచే స్వతంత్రమైన కల్పనలు, వర్ణనలు, చేసి తనదైన అపూర్వవర్ణనా నైపుణ్యముతో నృసింహపురాణ ప్రబంధమును సంతరించెను. ఎఱ్ఱన, ఈలక్ష్మీనరసింహావతారమును పురాణమనియు, ప్రబంధమనియు, కావ్యమనియు, విజ్ఞాన వాఙ్మయమనియు, అవతారికలో పేర్కొనెను. అయినచో ఇది పురాణమా ? ప్రబంధమా ? స్థలమాహాత్మ్యమా ? అనునది తేల్చవలసిన ప్రశ్న ? పురాణము పంచలక్షణ లక్షితము.

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ
సర్వేష్వేతేషు కథ్యంతే వంశానుచరితం చయత్ విష్ణుపురాణము 3 6.24

1. సర్గము 2. ప్రతిసర్గము 3. వంశము 4. మన్వంతరము 5. వంశానుచరితము. ఈ పురాణ లక్షణములు నృసింహావతారమున లేవు కావున ఇది పురాణముకాదు. నృసింహావతారమునకు కారణభూతమైన ప్రహ్లాదచరిత్రియే ఇందలి కథావస్తువు. అట్లని ప్రహ్లాదుని కథ అంతయు ఎఱ్ఱన గ్రహింపలేదు. సనక, సనందాదులు విష్ణుమూర్తి ద్వారపాలకులైన జయవిజయులను హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుని పుట్టుడని శపించుటయే ఈ కథకు బీజము.

ఇది క్షేత్రమాహాత్మ్యమా ? అనుసందేహము కథాప్రారంభమున కథాంతము కలిగించుచున్నది.

రసస్ఫోరకముగా వర్ణించెను. ఇది, పోతన గద్యరచనా సామర్థ్యము తెలుపుచున్నది, నరసింహమూర్తిని శాంతపఱచుటకు లక్ష్మీదేవిని దేవతలు ఆహ్వానించినట్లు మాత్రమే మూలమున గలదు. పోతన మహాకవి లక్ష్మీదేవి అభయంకరమూర్తిని చేరుటకు, భయమొందిన విధమును చారుభీషణముగ వర్ణించెను.

క. పలికెదనని గమకముఁగొను బలికినగడు నలుగుపిభుడు ప్రతివచనములం
బలుకడని నిలుచుశశిముఖి బలువిడి హృదయమున జనవు భయమును గదురన్
తె. భా. 7-343

భయసంకోచయుతయగు లక్ష్మీదేవి అడుగులు తడబడుట, ఈ పద్యములోని సర్వలఘుగమకములో మనకు గోచరించును. నరసింహునిచూచి, ఆమె పొందిన. సంకోచమును ఈసీసపద్యములో పోతన ఆవిష్కరించినాడు.

సీ. ప్రళయార్కబింబంబు పగిదినున్నదిగాని
నెమ్మోము పూర్ణేందు నిభముగాదు
శిఖిశిఖాసంఘంబు చెలువుసూపెడుగాని
చూడ్కి ప్రసాదభాసురముగాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుగాని
భూరికృపారస స్ఫూర్తిగాదు
భయదదంష్ట్రాంకుర ప్రభలుగప్పెడుగాని
దరహసితాంబుజాతంబుగాదు

తే. కఠినఖర నారసింహ విగ్రహముగాని కామినీజన సులభవిగ్రహము గాదు
విన్నదియు గాదు తొల్లినే విష్ణువలన గన్నదియుగాదు భీషణాకార మనుచు
తె. భా. 7-342

ఈ విధముగ పోతనమహాకవి, అమూలకమైన పద్యరత్నములను, రచించినాడు. ఆ మహానుభావుడు ప్రవహింపచేసినభక్తి గంగాలహరిలో ప్రతిఆంధ్రుడు తలమున్కలుగా అవగాహనముచేసి ఆనందించును.

—

యెక్కువ. హరివంశము ఇతడు "జగదర్చితంబైన ప్రబంధము" అనియు శ్రీకరకవి ప్రబంధానేక అనియు ప్రయోగించినాడు. నృసింహపురాణమున ప్రబంధశబ్దమును ఆరుపర్యాయములు, మహాప్రబంధశబ్దమును రెండుసార్లు ప్రయోగించినాడు. ఇట్లు మహాప్రబంధకల్పనా కుతూహలాయత్తంబగు చిత్తంబుతో

ఉ॥　ఉన్నతసంస్కృతాదిచతురోక్తి పదంబుల గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపకమేళుడనంగ　　　　　　　నృ. ప - 17
"ప్రబంధరచనా ప్రావీణ్యమునాకు సహజపరిణత సిద్ధంబై వెలసిన యది
ఊర్జిత శుభసంపద నొసరించుఁ బ్రబంధము
　　　　　　　　　　　　　　నృ - 14-17-20, 27, 26
"ఎఱిగింపు మాకు పరమోదాత్తప్రబంధోక్తులన్"

ఇట్లు ఎఱ్ఱన, కావ్యపురాణ, ప్రబంధశబ్దాలను సమానార్ధకములుగా వాడెను. ప్రబంధమనగా ప్రకృష్టమైన బంధము కలిగినది. అనగా, గ్రంథములోని, పూర్వాపర భాగములకు చక్కని పొందిక కలిగియుండుట. ప్రబంధమునకు, ప్రధానాంగములు 1. కార్య, కారణనిబద్ధత 2. వస్త్వైక్యము. నృసింహావతారమునకు, ఆవశ్యకమైన ప్రహ్లాదుని చరిత్ర మాత్రమే ఎఱ్ఱన గ్రహించెను. హరిభట్టు ఉత్తర నారసింహపురాణమున ప్రహ్లాదుడు ఉత్తర జీవితమున ఆజన్మ విష్ణుభక్తికి విరుద్ధముగా రాజ్యవిస్తరణాభిలాషతో దేవతలపై దండెత్తి, విష్ణువును కూడ తిరస్కరించును. ఆ కథా భాగము ఎఱ్ఱన స్పృశింపలేదు.

యత్త్రానుచితంకించ నాయకస్య రసస్యవా
విరుద్ధం తత్పరిత్యాజ్యం మన్యథావా ప్రకల్పయేత్,

నాయకుని చరిత్రకు కళంకము నాపాదించు కథాంశమును పరిత్యజించుట ఎఱ్ఱన ఔచిత్యదృష్టికి తార్కాణము. ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు చెప్పిన అభిప్రాయము ప్రకారము ఈ కథకుబీజము సనక, సనందాదులు, విష్ణుని ద్వారపాలకులైన జయవిజయులను రాక్షసజన్మ మెత్తునట్లు శపించుట. ఈ వృత్తాంతము కారణముగ ఉపక్రమింపబడి, హిరణ్యకశిపుని దుర్వర్తనముతో, విస్తరించి ప్రహ్లాదుని రక్షణముతో పర్యవసించిన ఈ కథ నృసింహావతారమునకు కారణభూతమును, కార్యభూతమును అయి పూర్వోత్తర కథాంశముతో, సుసంఘటితమై యున్నది. ఇందు కార్యకారణనిబద్ధత, వస్త్వైక్యము అనవద్యముగ నిర్వహింపబడుటకు తోడుగా ప్రబంధోచితములైన అష్టాదశవర్ణనలలోని పెక్కు

సీ. అఖిలలోకేశ్వరుండగు రమాధిపుతోడ
విడువనివైరంబు వొడరునట్టి
మోఱకత్వమేటికో మొలచెదైత్యునిబుద్ధి
నెమ్ముంగి నిష్ఠదైత్యేంద్రసుతుడు
శ్రీసత్త్వవక్షు మెచ్చించె శ్రీ నరసింహ
మూర్తియే కారణమున జనించె
విభు డహోబల నాథవిఖ్యాతి నెట్లయ్యె
నీ తీర్థవరమున కెందు గలుగు ... ... ... నృసింహ ప్ర 20

ఇట్లు ప్రారంభింపబడి పంచమాశ్వాసమున అహోబల ప్రశస్త్యము నృసింహ స్వామివెలయుట లక్ష్మీవనము భవనాశని పావిత్ర్యము మొదలగునవి స్తుతింపబడినవి.

క్షేత్రమాహాత్మ్యములో దైవత క్షేత్ర తీర్థమాహాత్మ్యములు వర్ణింపబడినవి. ఈ మూడింటికి సమప్రాధాన్యము ఉండకపోవచ్చును. క్షేత్రమాహాత్మ్యలక్షణము

చ. అనుడు నగస్త్యుడిట్లనియె హైమవతీ సుతుతోడ దోడి స
న్మునులలరంగ నోయఘమూర్తి, సమస్తము గ్రిందుచేసి మిం
చిన బలువేల్పు దీర్థమును క్షేత్రము నొక్కెడగూడి యుండునే
ని నిరుపమాదృతిం దెలిపి నీవుమమ్ముం గరుణింపగాం దగున్
పాండురంగ 1-152

వేల్పు, తీర్థము, క్షేత్రము మూడును ఒకచోటనే సమప్రాధాన్యము కలిగి యుండుట అపూర్వమని పైపద్యము వలన తెలియనగును. అందలి క్షేత్రదైవతములు తదితర పరివారము, ద్వారపాలకులు, ప్రాకారము, దానికోలతలు, ప్రధానముగ వర్ణింపబడినవి. క్షేత్రప్రాధాన్యమును ఇనుమడింపచేయుటకు పతితులు, మహాపాపులు, ఆ క్షేత్రదైవత దర్శనముచేయుటచేత పునీతులై స్వామి సాయుజ్యముపొందుట, విస్తృతముగ వర్ణింపబడును. ఈ లక్షణము, రామకృష్ణుడు, ధూర్జటి పాటించినారు. ఎఱ్ఱన పాటింపలేదు. ఈ గ్రంథమున లక్ష్మీనరసింహస్వామి, అవతరించుటచేతనే దానికి క్షేత్రమాహాత్మ్య ప్రఖ్యాతి వచ్చినదని చెప్పవచ్చును

ఇది ప్రబంధమా ? కవిత్రయ కాలమునాటికి ప్రబంధ శబ్దము కావ్యసామాన్య వాచిగా ప్రయోగింపబడుచున్నట్లు తిక్కన, ఎఱ్ఱనల ప్రయోగములు తెలుపుచున్నవి. తిక్కనార్యుడు, భారతమును ప్రబంధమండలి అనిపేర్కొనెను. ఎఱ్ఱన, ప్రబంధశబ్దమును, కావ్యసామాన్యవాచిగా ప్రయోగించినాడు. ఆతనికి ప్రబంధశబ్దముపై మక్కువ

నాయక ప్రశంసమణిహారములోని సూత్రమువలె సర్వత్రవ్యాపించియున్నది. దేవతా నాయకమగుట దీనియొక్క వైశిష్ట్యము.

## పోతన ప్రహ్లాద చరిత్ర

భాగవతము మహాపురాణము, దశలక్షణ లక్షితము.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ
సర్వేష్వేతేషు కథ్యంతే వంశానుచరితం యత్

శ్లో॥ సర్గోప్యస్య విసర్గశ్చ వృత్తీ రక్షాంతరాణిచ
వంశో వంశానుచరిత సంస్థాహేతురపాశ్రయ
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః

చతుర్వేదములను, సాంగోపాంగముగ నెరుంగని వాడు వివేకి కానేరడు. అట్టి వానిని తనకు ఘాతచేయువానిగ, వేదమాత బెదరును. "పురాపినవం పురాణమ్" కడచిన పెక్కుకల్పముల చరిత్రను తెలుపునదయ్యును. నిత్యము నూతనముగ వెలుగొందునది పురాణమని అభియుక్తోక్తి. సకల పురాణములలో శ్రేష్ఠమైనది భాగవత పురాణము. వేదమంత్రోక్తములైన దేవతల రూపములను చరిత్రను వివరించి, ఆయాదేవతల పూజాప్రార్థనోపాసనాదులను విధించి జీవుల చిత్తశుద్ధి సాధనాది విశేషములను పురాణములు చెప్పుచున్నవి. భౌతికవాదులైన, హిరణ్యకశిపు ప్రభృతులకును, ఆధ్యాత్మికవాదులగు ప్రహ్లాదాదులకు, నడుమ జరిగిన, సంఘర్షణము ఆసుర, దైవసంపదలనుపేర సర్వత్రనిరూపిలచి, ఉపనిషత్ప్రతిపాదితమైన జ్ఞానమును నిలబెట్టజాలినవి పురాణములు,

"యస్మిన్ జ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి" అను నానుడి వేదములయెడవలెనే, పురాణములయెడ, అన్వర్థము. భారతీయ సంస్కృతిని పామరులవఱకు ప్రచారము చేయు ఉత్తమసాధనములు పురాణములే. అవి ఆస్తిక్యమునను పట్టుగొమ్మలు, అవి సందర్భానుగుణముగ ఒక్కొక్క దేవతనే ప్రశంసించుచున్నట్లు గోచరించినను మొత్తముమీద, దేవతలందఱకిని సమాన గౌరవమిచ్చినవి. నీతి, ధర్మములకు అవి నిధానములు. మానవులకు మిత్రులవలె, కర్తవ్యాకర్తవ్యములను కథోపాఖ్యానముల ద్వారమున, బోధించుటచే అవి, మిత్రసమ్మితములు. మానవుల విజ్ఞానాభివృద్ధికి కావలసిన సర్వవిషయములను, పురాణములు బోధించును.

వర్ణనలు ఇందు కావ్యాంగములుగ నమరినవి. సముద్ర, దేశ, పుర, పౌర, ఉద్యాన, ఋతు, దౌహృదాదులతో, ఇందు రమణీయముగ వర్ణింపబడినవి. ఈ వర్ణనా కౌశలము ప్రబంధకవులదే. పదునారవ శతాబ్దమందలి ప్రబంధములకు మార్గదర్శకత్వము వహించినది. దీనిని పురాణములె కాక, ప్రబంధమువలె, ఎఱ్ఱన నడపించినాడు బ్రహ్మాండాది పురాణములనుండి, కథను, స్వల్పముగ తీసికొన్నను, స్వతంత్ర కల్పనలపై ఎక్కువ మక్కువచూపినాడు. కావ్యమున లోకోత్తర భావనాశక్తిని ప్రదర్శించుటకు అనువైన సందర్భములలో వర్ణనలనుకల్పించి తన వర్ణనా ప్రావీణ్యమును ప్రకటించినాడు. తెలుగు పద్యరచనమున క్రొంగ్రొత్త సోయగములను, వెలువరించుచు, నూత్నశిల్పము ప్రకటించినాడు. ఎఱ్ఱన పూర్వాంధ్ర మహాకవుల విశిష్టమార్గమును, అనుసరించుచు, అపూర్వవర్ణనా నైపుణ్యమును సంస్కృత పదవిశిష్టమైన, చతురోక్తులతోకూడిన ప్రబంధశయ్యను కీలించినాడు. వేయి మాటలేల ఆంధ్ర ప్రబంధభానూదయమునకు ఎఱ్ఱన నృసింహపురాణ రచనము అరుణోదయము అని చెప్పవచ్చును.

ఈ గ్రంథము, కార్యకారణ, నిబద్ధతతోకూడిన చక్కని ప్రబంధము.

1. జయ, విజయులు, హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా పుట్టుట.

2. హిరణ్యకశిపుడు, ప్రకృతి పారుష్యదూష్యుడై తపస్సు చేసి, బ్రహ్మచే వరదానగర్వితుడై విజృంభించుట.

3. దేవతలు, హిరణ్యకశిపుని, సంహరింపుమని, శ్రీమహావిష్ణువును కోరుట.

4. హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని బాధించుట.

5. నృసింహస్వామి ఆవిర్భవించుట.

అను భాగములతో, ఈ కథ సుసంఘటితమైనది. ఎఱ్ఱన ఈ గ్రంథమునకు లక్ష్మీనృసింహావతారము, అనుపేరు పెట్టుటలో విశేషమున్నది. నృసింహపురాణము అను పేరు, కవి పెట్టినదికాదు. చదలవాడ మల్లయ్య, అప్పకవి ప్రయోగించినారు. నృసింహావతారమునకు, ప్రహ్లాద రక్షణమునకు ఆవశ్యకమైనంత మాత్రమే ఇందు వర్ణితము. కావున ప్రహ్లాదరక్షణరూపమైన నృసింహావతారమే ఇందు ప్రధానేతివృత్తము. ఇది మనసులో నిడుకొని ఎఱ్ఱన లక్ష్మీనృసింహావతారమని, పేరు పెట్టినాడు.

ఈ గ్రంథమున నాయకుడు శ్రీమహావిష్ణువు. ప్రతినాయకుడు, హిరణ్యకశిపుడు. ప్రహ్లాదునిభక్తి హిరణ్యకశిపుని ద్వేషాదులచేపల్లవించి, పుష్పించి, ఫలించెను.

ఆ॥ ఘనిను రసజ్ఞులై వినువారికి మాటమాట కధిక మధురమైన
యట్టి కృష్ణకథన మాకర్ణనము సేయదలపు గలదు మాకుదనివిలేదు
తె॥ భా ప్ర-43-45

భక్తకథామాలలో భగవంతుని భక్త రక్షణపరాయణత్వము సూత్రమువలె వ్యాపించినది. భాగవతమున, విష్ణుమూర్తి లీలలు, అధికారికేతివృత్తము. ప్రహ్లాద చరిత్ర ప్రాసంగికము. పరిక్షిన్నరేంద్రుడు, వైరముతో శ్రీమహావిష్ణువు సాయుజ్యము పొందవచ్చునా? ఇది అద్భుతముగా నున్నది; అని ప్రశ్నించెను. దీనికి సమాధానముగా శ్రీశుకమహర్షి విష్ణుభాగవతోత్తముడైన ప్రహ్లాదుని చరిత్ర మధుమధురముగ చెప్పెను.

ఆ॥ అలుకనైనఁ జెలిమినైన గామంబున నైన బాంధవముననైన భీతి
నైనదగిలి తలపనఖిలాత్ముడగు హరి జేరవచ్చు వేఱుసేయ డతడు.
తె - భా - 7-14

ప్రపంచసాహిత్యమున విరోధముతో భగవంతుని చేరుట అపూర్వము. హిరణ్యకశిపుడు, విష్ణుద్వేషముతో సాయుజ్యము పొందుట ఈ గ్రంథమున మనోహరముగ వ్యాఖ్యానింపబడినది.

## ఇతివృత్త నిర్వహణమున, ఎఱ్ఱన పోతనలకు గల తారతమ్యము

కావ్యప్రక్రియ ననుగుణముగ ఇతివృత్తము నిర్వహణము జరుగును, ఎఱ్ఱన నృసింహపురాణము ప్రబంధాభిముఖముగా సాగినది. పోతన ప్రహ్లాద చరిత్ర ఉపాఖ్యానము. కథాప్రారంభముననే

"లక్ష్మీసంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపద
ద్దాసాఖ్యానములొప్పు"

అనగా ప్రహ్లాదచరిత్ర ఆఖ్యానమని చెప్పినాడు స్వతంత్ర గ్రంథము నిర్వహించుటకు, ఉపాఖ్యానము నిర్వహించుటకు తారతమ్యమున్నదికదా!"

ఎఱ్ఱన, నృసింహపురాణమున ఒకటి రెండు తక్కువగా; అష్టాదశవర్ణనలను, చేసి, కథాగమనము సాగించినాడు. ప్రబంధములోని, కథాగమనము, గజగమనమువలె, ఉండును. హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగ, జన్మించిన వృత్తాంతము చెప్పు సందర్భమున ప్రథమాశ్వాసమును, క్షీరసముద్ర, శ్వేతద్వీప, వైకుంఠపురవర్ణనములతో, ప్రారంభించి, 107 పద్యములతో చెప్పినాడు. నృసింహపురాణము, ఎఱ్ఱన, వర్ణనలకొఱకే రచించినాడా? అనుభావము గ్రంథము, చదివిన సహృదయమునకు కొట్టవచ్చినట్లు కన్పించును.

భాగవతము, సర్వమునిగణ సంసేవ్యమైనది. శుకమహర్షి అధ్యయనముచేసి మోక్షశాస్త్రమను తలపున ముముక్షువైన పరీక్షిత్తునకు బోధించెను. దీనికి సర్వపురాణోత్కృష్టత్వము, సర్వోపనిషత్తుల్యత్వము అంగీకరింపబడినవి వ్యాసమహర్షి వేదములు విభజించియు, పంచమవేదమైన భారతమును రచించియు తృప్తిపడక, సంతపోవగచుచూ, సరస్వతీనదీ తటమున, ఒంటరిగా కూర్చుండి చింతించుచుండెను. నారదమహర్షి ఆతని చింతను పటాపంచలు చేయుటకు ఉత్తమోపాయమును సూచించెను. నీవు ధర్మములన్నియు చెప్పితివి. కాని విష్ణుకథలు చెప్పవైతివి. గుణములెన్నక, ధర్మములు చెప్పినంతమాత్రమున విష్ణుడు మెచ్చునా? హరిని స్తుతింపకుండుటయే నీవంతకు కారణము. హరిసేవ మహత్త్వము, శ్రీమహావిష్ణువు గుణ గానము చేయుమని ప్రబోధించెను భక్తియోగముకంటె, ఇతరోపాయము లేదని భువనక్షేమంకరమైన భాగవత పురాణము చెప్పుచున్నది.

మ॥ లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై. తె. భా - పీఠిక.

భాగవతము విష్ణుపారమ్యము బోధించు గ్రంథము. అందుచే దానికి విష్ణుభాగవతమను పేరు అన్వర్థము శ్రీమహావిష్ణువుయొక్క అవతారలీలలను, శ్రీమన్నారాయణమూర్తి భక్తులను రక్షించుట, భక్తిమార్గము విశిష్టమైనదని చెప్పుట భాగవత ధ్యేయము. భక్తిమార్గము, సంసార తరణోపాయముగ భాగవతము ప్రబోధించినది. ద్వితీయస్కంధమందు ప్రపంచోద్భవప్రకారము, నవమస్కంధమున వంశానుచరితము, దశమస్కంధమున శ్రీకృష్ణుని లీలలువర్ణితములు. ఇతర స్కంధములందు ఏ, ఏ, మన్వంతరములందు ఏ, ఏ, భగవంతుడు అవతారమును ఎత్తి ఏ, ఏ, కార్యములాచరించెనో, విపులముగ చెప్పబడినది. పరిశీలనము చేసినచో, భాగవతము భగవంతుని యేకవింశత్యవతారముల వర్ణనముతోకూడినది. ఆ అవతారములకు సంబంధించిన కథలన్నియు సముచితముగ వర్ణింపబడినవి.

సీ॥ ఎవ్వని యవతార మెల్లభూతములకు
సుఖమును వృద్ధియు పొందఁజేయు
నెవ్వని శుభనామమే ప్రొద్దునుడువంగ
సంసార బంధంబు సమసిపోవు
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్చిన
భయమొంది మృత్యువు పరువువెట్టు

ఈ సందర్భమున శాంతిరసమునుగూర్చి కూలంకషముగా బ్రహ్మశ్రీ సన్నిధానమువారుచేసిన చర్చనను సంధింపనగును. ఆనందవర్ధనుడు, తృష్ణాక్షయసుఖమే స్థాయిభావమనెను.

శ్లో. శాంతశ్చ తృష్ణాక్షయ సుఖస్యయః పరి పోష స్త ల్లక్షణోరసః
ప్రతీయతఏవ ఈశాంతి మహంకార ప్రశమైక రూపము

అయినచో శాంతమునకు స్థాయిభావమేమి ? అను ప్రశ్నకు అభినవగుప్తుడు తత్త్వజ్ఞానమే స్థాయిభావమని నుడివిరి.

ఇహతత్త్వజ్ఞానమేవతావన్మోక్షసాధనమితి తస్యైవమోక్షేస్థాయితా యుక్తాతత్త్వజ్ఞానానందనామ ఆత్మజ్ఞానమేవతేన ఆత్మైవ జ్ఞానాంద ఏవశుద్ధ ధర్మయోగి పరికల్పిత విషయోపభోగ రహితోత్రస్థాయి.

జ్ఞానానందాది విశుద్ధ ధర్మములు గలిగిన విషయోపభోగ శూన్యమైన ఆత్మయే స్థాయి. అని సారాంశము. ఈస్థాయిభావము ఇతరస్థాయిభావముల వంటిదికాదు. ఇదిస్థాయితమము. మిగిలిన స్థాయిభావములన్నింటికి మూలభూతము. ఏలన, శాంత రసము ప్రకృతిరసము. మిగిలినవి వికృతి రసములు.

భావా వికారారత్యాద్యాశ్శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పున స్త త్రైవ లీయతే
స్వంస్వంనిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్త పాయేతు శాంత

శాంతము ప్రకృతి రసము రత్యాదిభాములు వికృతులు. ప్రకృతివలన పుట్టిన వికృతి, ప్రకృతియందే లీనమగును. అయా నిమిత్తములనుబట్టి శాంతమునుండి రత్యాదులు ప్రవర్తిల్లును. ఆ నిమిత్తముడుగగనే శాంతమే నిలుచును. కావున శాంతము భిత్తివంటిది. రత్యాదులు వానిపై వ్రాయబడిన చిత్తరువులవంటివి. భిత్తిస్థిరమైనది. చిత్తరువులస్థిరములు. ఒక చిత్తరువును చెరిపి మఱొక చిత్తరువును వ్రాయుచున్నను భిత్తి ఏకరూపముగ నిలచును. కావున శాంతమునుండియే, నిమిత్తమునుబట్టి యితర రసములు వెలువడును. నిమిత్తమడగగనే మరల శాంతమే నిలచును.

శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్యశాంతం మనస్సదా

పోతన, జయ, విజయుల శాపవృత్తాంతమును విద్యుద్వేగముతో సాగుటకు అనువుగా, కేవలము ఒక పదనములో చెప్పి ముందుకు సాగిపోయినాడు. పోతన ప్రహ్లాద చరిత్రను నాటకీయముగ నడపినాడని చెప్పవచ్చును.

నృసింహపురాణమున నరసింహస్వామి, అహోబలమున వెలయుట, ప్రధాన పరమార్థము. భాగవతమున, శ్రీమహావిష్ణువు నృసింహమూర్తిగా నవతరించి, పరమ భాగవతోత్తమైమున ప్రహ్లాదుని రక్షించి, రాక్షసరాజ్యమునకు పట్టాభిషిక్తునిచేసినాడు. గ్రంథనామమును బట్టియు ఈ రెండు గ్రంథములలో ఇతివృత్త నిర్వహణములో భేదముపాటింపబడినది.

# రసపోషణము – పాత్రపోషణము

## నృ సిం హ పు రా ణ ము

లక్ష్మీనృసింహావతారంబను పురాణకథలో నంగిరసము శాంతమనియు. భక్తి అంగముగా పోషింపబడెనని చెప్పవచ్చును. ఈ గ్రంథమునకు నాయకుడు అహోబల నరసింహదేవుడని కవి స్పష్టముగా చెప్పెను.

"అమ్మహాప్రబంధమునకు నస్మత్పితామహ హృదయగుహా విహారమహా సింహంబగు శ్రీమదహోబల నరసింహదేవుండ ధీశ్వరుండగుటంజేసి కృతికి విభుండు శ్రీవిభుండు కీర్తన పావనమై తద్గుణ స్తుతికృతి". నృ. పీ. 27–28

ఈ కావ్యఫలము అహోబలమున నరసింహస్వామి వెలయుట. అయిదాశ్వాసములలో శ్రీమహావిష్ణుమూర్తి పూలమాలలో సూత్రమువలె వ్యాపించి కథ నడపించినాడు. సాధారణముగ గ్రంథములన్నియు తుచ్ఛమైన సంసారికేతివృత్తములు, ఇది దేవతానాయకమగుట దీని విశిష్టత. ప్రతినాయకుడు హిరణ్యకశిపుడు.

అలంకారశాస్త్రములో అష్టరసములా? శాంతము నవమరసముగా స్వీకరింప నగునా? శాంతరసమునకు స్థాయిభావము ఏది? శాంతమునకు స్థాయిభావము శమమా? తృష్ణక్షయసుఖమా? నిర్వేదమా? జుగుప్సయా? ధృతియా? తత్త్వజ్ఞానమా? శ్రవ్య దృశ్య కావ్యములలో శాంతము అంగిరసముగా పోషింపవచ్చునా? అను విషయములలో అభిప్రాయభేదములున్నవి.

ప్రహ్లాదునకు శైశవమందే ప్రౌఢమునులుకోరు హితవివేకపాకము కలిగినది. చరాచర ప్రపంచములోని వస్తుజాతమంతయు అశాశ్వతమని బ్రహ్మపదార్థమొక్కటియే, నిత్యమని, సత్యమని గ్రహించి తత్త్వజ్ఞానము పరబ్రహ్మమే. అచ్యుతుడు, అవికారుడు, అమితతేజుడు, విష్ణుడు, ఆదిదేవుడు అని గుర్తించినాడు. ఆ పరబ్రహ్మమునకు ఆదిమధ్యాంతములులేవని ఆగమములు ఘోషించుచున్నవి. దానికిపొడముట, పొదలుట, తరుగుట, అనుషడ్వికారములు లేవు. ఎవ్వనివలన, ఈచరాచరసృష్టి కిరిగి, పెరిగి లయమగుచున్నదో, కారణంబులకెల్ల కారణంబో అట్టి విష్ణుమూర్తిని ఆశ్రయింపవలెను. సకల మానవులు చదువులలోని మర్మమును గుర్తించుటయే అనుత్తమపురుషార్థము. అదియే ఆత్మహితము. శరీరము పుట్టును, పెరుగును, వయసులో అందముతో చెన్నొందును. ముదిమి చేతచిక్కును. పిదపవచ్చును. చచ్చిన జీవుడు తిరిగిపుట్టును. జీవన, మరణ, పరంపరలేని స్థితియే మోక్షము ఈ ఉపాయమును మునీశ్వరులు, ప్రీతిజలమునుదిలికి, పొందిరి. కారణములేక జన్మకలుగదు. జన్మకుకారణము పూర్వకర్మఫలము బీజముపాతిన మొక్కవచ్చును. జీవితల్లికడుపులో కొంతకాలముండి తరువాత వెలికివచ్చును. లోకములో ఏవస్తువు శాశ్వతముగా సుఖమును, శాశ్వతముగ దుఃఖమునీయదు. ఆకలి పొందినప్పుడు అన్నము, దప్పిక, పొందినప్పుడు నీరు సౌఖ్యముకలిగించును. జ్వరము వచ్చినప్పుడు అన్నము విషప్రాయమగును. వస్తువులు, సుఖప్రదమని భావించుట భ్రాంతి. శరీరము, మురికి డొక్క. కావున మానవుడు ఆలుబిడ్డలపై ధనముపై, చెలులపై ఎంతప్రీతి పెంచుకొనునో అవి చేసినపిమ్మట అంతకంటె, రెట్టింపు దుఃఖము కలుగును. శైశవమునందే కష్టతరమగు మోహమును కోసివేసి, విష్ణుమయ సమాహిత, తత్త్వచింత యందు తాత్పర్యము నుంచవలెను. విష్ణుమూర్తి సకలజీవ హృదయాంతర్గతు డగుటచే, అందఱియందును సర్వభూతదయ పెంచుకొనవలెను. తత్త్వజ్ఞానమునకు శిఖరాయమాణమైన భావము.

శ్లో॥ మనమునను దుస్స్వభావ సంజనితమైన భేదబుద్ధి దొఱంగి యభిన్నుడైన
విష్ణునఖిల భావములందు వెదకికాంచి యనఘులార పొందుదమనయమునుఖంబు

నృసిం-చ-88

ఇందు ప్రతిపాదింపబడిన తత్త్వజ్ఞానము ఉపనిషత్ ప్రతిపాదితమైనది. భగవద్గీతలోని పరమార్థమిదియే.

నృసింహపురాణ పంచమాశ్వాసమున వైష్ణవసిద్ధాంతమునకు అనుగుణముగ, మలచబడినది. కావ్యమున ప్రధానముగ, మోక్షపురుషార్థము ప్రతిపాదింపవలయును.

ఎల్ల శాస్త్రములును, శమముకొఱకే పండితులు నిర్మించిరి. కావున ఎవని మనస్సు శాంతముగ నుండునో వాడు సర్వశాస్త్రజ్ఞుడని చెప్పబడుటచే శాంతమే ప్రధానమని తేటబడుచున్నది. దీనికి రత్యాదులన్నియును వ్యభిచారులగును. ఈ శాంతమునకు స్థాయిభావము తత్త్వజ్ఞానము లేక ఆత్మజ్ఞానము లేక, జ్ఞానానందాది ధర్మోపేతమై విషయోపభోగరహితమైన ఆత్మయే.

కావ్యాలంకార సంగ్రహము 320-444

శాంతమునకు శమము స్థాయిభావము. అది ఉత్తమనాయకము. శ్వేతవర్ణము. అధిదేవత శ్రీమన్నారాయణుడు. జగత్తు అనిత్యమని తెలియుటచే సంభవించిన అశేష వస్తునిస్సారతకాని,

"సర్వంఖల్విదం బ్రహ్మ" "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"

ఇత్యాదికమగు బ్రహ్మస్వరూపముగాని దీనికి ఆలంబనవిభావము. పుణ్యాశ్రమ హరిక్షేత్ర, తీర్థరమ్యవనాదులు, మహాపురుష, సాంగత్యాదు లుద్దీపనవిభావములు. రోమాంచ, సంతోష, భూతదయాదు లనుభావములు. నిర్వేద, హర్ష, స్మృతిమతి మొదలయినవి. వ్యభిచారిభావములు.

నృసింహపురాణమున, ఆలంబనవిభావము. నృసింహపరబ్రహ్మము. స్థాయిభావము తత్త్వజ్ఞానము. ప్రథమాశ్వాసమంతయు వైకుంఠము లక్ష్మీనారాయణులు తీర్థరమ్యవనాదులు చక్కగా వర్ణింపబడినవి. ఇవియే ఉద్దీపనవిభావములుగ చెప్పవచ్చును. శాంతమునకు అధిదేవత నారాయణుడు. హరిభక్తుల తపము, తపము హరిభక్తులజపము, జపము. హరిభక్తుల భాసురజన్మము, భవసారము. "హరిభక్తులు భువనపావనైక విహారుల్."

అఖరమాషణ, శోషణ, కారణంబు అఖిల దురితోత్తారణంబైన నారాయణ మంత్రంబు సవిశేషసంస్కారంబుగా బ్రహస్పతిఇంద్రునకు ఉపదేశించెను. బృహస్పతి, ఇంద్రునకు హిరణ్యకశిపుని పీడ తొలగించుకొనుటకు ఉపాయమిట్లు చెప్పెను.

"మనకు దైవంబు, దాతయు, వాసుదేవుడు మనకు అననేల అనేక బ్రహ్మాండ" కోటిజాతంబైన చరాచరభూతంబులకు పరాయణంబు నారాయణ నిధానంబగు తేజంబు ఈ జగంబుల సంకటము డుప నాదేవునకు నపరిహార్యంబు మనచు మ్మాహాత్మ్య శ్రీపాద పద్మ నిచేరి విన్నవింతము.

ఈ గ్రంథపరమార్థము లోకములోని దృశ్యమాన ప్రపంచమంతయు అశాశ్వతమని గుర్తించి వాసుదేవ పరబ్రహ్మము నాశ్రయించుటయే కర్తవ్యమని చెప్పుట.

డూషలు దుర్గకానన కఠోరితా చంద్రిక లేదమూక స
ద్భూషలు విష్ణు మంగళకథా విముఖాత్ములు దుష్టజన్మముల్

సీ. త్రిభువన వ్యాపకదీప్తి నిర్గుణమూర్తి
వాసుదేవాఖ్య నుజ్జ్వలత నొంది
జగదేక సంహార సమదతామసమూర్తి
నతుల సంకర్షణా హ్వాయతఁబేర్చి
విశ్వరక్షాకర వినుత సాత్వికమూర్తి
బ్రద్యుమ్ననామ విఖ్యాతిఁ బరగి
భువనసంభవ హేతుభూతరాజసమూర్తి
ననిరుద్ధనామధేయాప్తినొంది

శ్రుతిపదంబులుఁ దనుఁజతుర్మూర్తియనఁగ నఖిల కథలును దనుజతురాత్ముఁ డనగ
నాగమంబులు దనుజతుకు రక్షుడనగ నొక్కరుఁడ యాతఁడచ్యుతుడుల్లసిల్లు.

నృ - పం - 24-60

ఈవిధముగ ఎఱ్ఱన విష్ణుభాగవతోత్తములు చెప్పిన విష్ణుభక్తికిగల సర్వాంగము లును మనోహరముగ పోషించెను. ఎఱ్ఱన, స్తంభోద్భవమున అవతరించిన శ్రీనృసింహ మూర్తి వర్ణించునపుడు సందేహాద్భుతములను జోడించెను. అద్భుతమునకు స్థాయి భావము విస్మయము.

చ. అనపుడు రోషహాస వివృతాననుడై దిని జారి యోరినీ
వనయము నెందుగిల్లగ సమర్ధనజేసిన యాతడిందు గ
ల్గులె యనుచున్ జగద్వలయ ఘోరకరాహతి వ్రేసెగంబమ
త్యనుపమ తత్ప్రభాభవన మల్లల నాడగలంగ లోకముల్

సీ. బడబానలాహతి జలనిధిలోనున్న
పటుశైల తతిప్రేలి పెటిలెనొక్కొ
ఘనతరోత్పాతనిర్ఘాత సహస్రంబు
గడగియొక్కట వ్రేసిపడియె నొక్కొ
పెక్కుజీవులులోన బిక్కట్టువడగనా
బ్రహ్మాండభాండంబు పగిలెనొక్కొ
తటిగాకయున్న యుద్ధతిబేర్చి రుద్రుండు
విలయోగ్ర పటలంబు వ్రేసె నొక్కొ

వాసుదేవ పరబ్రహ్మమునందు భావితచేతస్కులగుట, ముఖ్యము. హిరణ్యకశి ని సంహరించిన విష్ణుమూర్తిని ప్రహ్లాదాదులు స్తోత్రముచేయగా, అహోబలమున శాంత స్వరూపుడైన నరసింహస్వామి వెలసినాడు. ఫలశ్రుతి ఎఱ్ఱన ఇట్లుచెప్పినాడు.

చ. సమధిక భక్తియుక్తుడయి శార్ఙ్గిభజించు నరుండు సంతత
స్థిమిత యశోవిలాసుడయి చెన్నలరారెడు భోగభాగ్య దు
ర్దమవి భవంబుపై సుకృతి తద్దయు గాంచుచు మర్త్యలోకని
ర్గ మనమునాడు విష్ణుసపకంతము నొందు వినిశ్చలంబుగన్

నృ-పం-192

ఇందు సామీప్యరూపమోక్షము ప్రతిపాదింపబడినది. ప్రహ్లాదుడు విష్ణుమూర్తిని ఇట్లుకోరెను.

క. ఏజన్మమున జనించిన నాజన్మమునందు నీ సమంచిత చరణాం
భోజంబులపై విగతవ్యాజమయిన భక్తి, భక్తవత్సల ! యీవే

క. ఖలులకు సంసారముపైగల వేడుకబాపిమోక్ష గరిమము గూర్పన్
వెలయవలయు నీమహిమలు దలపుచునిట్లున్న నాదుతలపున వరదా

నృ - పం- 188-189

అవినం ప్రసన్నుండై భక్తవత్సలుండిట్లకా నను గ్రహించితి. నీవు యోగీంద్రు లకు మద్భక్త జనంబులకు బ్రాహ్మ జనంబులన్నియు? నీ యరచేతిలోనివి. మదీయసా లోక్యసారూప్య సామీప్య, సాయుజ్య సిద్ధులున్, క్రమంబునన్ బొందగలవాడవని యానతిచ్చెను. నృ-పం-190

ఎఱ్ఱన ప్రథమాశ్వాసమున, మహారసికుడు, సమగ్రసార శృంగార రసాధి దేవత అగు శ్రీమహావిష్ణువు నాయకునిగాచేసి, ఆదిలక్ష్మిని నాయికగాచేసి శృంగార రసమును ఔచిత్యవంతముగా పోషించెను.

పంచమాశ్వాసమున దేవతలు ప్రార్థింపగా, స్వామిఅంకతలము నందు, నారాయణీదేవి ఆశ్లేషమొనర్చిన విధము జీవేశ్వరైక్యము ప్రతిపాదించు శృంగారము పరమోదాత్తము. భక్తిరసచిత్రణమున ఎఱ్ఱన అందెవేసినచేయి. ఇతడు ప్రహ్లాదుని విష్ణుభక్తిని, బహుధాప్రపంచించి యున్నాడు.

ఉ. ఊషర బీజముల్ భసితయోజ్యఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టితతుల్ మృగతృష్ణికాంబు గం

రోమాంచ అశ్రుపాతాదులను భావములుగా హర్షాదులు, వ్యభిచారులుగా గలిగి భాగవతాది పురాణశ్రవణ సమయమున ననుభవింపబడు భక్తిరస మేలకాదు ?

"భగవద్విషయక ప్రేమప్రకర్షో భక్తిఫలమ్ భజనమ్, అంతఃకరణ స్యభగదా
కారతారూపంభక్తిః
ద్రుతస్యభగవద్ధర్మాద్ధారావాహికతాంగల్
సర్వేశేమనసోవృత్తిర్భక్తిరిత్యభిధీయతే
శ్రవణ, కీర్తనాది, సాధనములుకూడ భక్తిశబ్దవాచ్యములే.
భజ్యతేభగవదాకారమ్, అంతఃకరణం క్రియతే
అనయా ఇతికరణవ్యుత్పత్త్యాన
భక్తిశబ్దేన శ్రవణకీర్తనాది సాధనమభిధీయతే.

భక్తిరసమున కాలంబనవిభావమ భగవంతుడే భగవతాకారతా చిత్తవృత్తి రూపమగుస్థాయి భావమును భగవంతుడే పర్యవసానమున ప్రతీయమానమగు పరమానందమకు భగవంతుడే, దీని, మధుసూదన సరస్వతి యిట్లు వివరించుచున్నాడు. ఆలంబనరూపమగు భగవంతుడు బింబస్వరూపుడు. సహృదయగతమగుస్థాయి ప్రతిబింబము. భగవద్రూపము నిరతిశయానందము

ఉపాధినిష్ఠమైన ప్రతీయమానమగుబింబమే ప్రతిబింబమనబడుచున్నది. పరమానందరూపుడగు భగవంతుడు మనస్సున ప్రతిబింబస్థాయి భావత్వమును పొంది నారసతమునపాదించును. ఇట్లు భక్తిరసము పరమానందరూపమగుట నిర్వివాదము.

అనుభవమాత్రమువలననే సాక్షాత్సుఖవిరుద్ధములగు శోక క్రోధ భయాదులకు రసత్వమునంగీకరించియున్నాడు తక్కిన రసములకంటే వేయిరెట్లధికముగా భక్తి రస్యమానమగుచున్నది. ఇది అనుభవసిద్ధము. దీనిని, రసముకాదని యెట్లనుచున్నారు? దేవాదివిషయక, రతిః సముకాదనియు, భావమమాత్రమే యనియు రసకోవిదులుచెప్పిరి ఇతర దేవతలకు సంబంధించినంతవఱకు, ఇది యోజ్యమే. వారు జీవులే అగుట, పరమానందము కలుగదు. పరమానందరూపుడగు శ్రీకృష్ణపరమాత్మయెడగల రతిమాత్రము పరమానందసంధాయకము. దీనిని భావమనరాదు.

కాంతాదివిషయకములగు రసములందు భగవద్రతియందువలె పరమానందము కలుగదు. పరిపూర్ణమగు సుఖమును కలిగింపలేవు. కావున వానికి పూర్ణముగా రసత్వము సిద్ధింపదు. అవి క్షుద్రరసములు భగవద్రతిమే పూర్ణరసము మిణుగురులు

యనగ నాకాశసకల దేశావకాశ భరితమై విశ్వమును పూర్ఛపాలు పడగ
మొనసి పెఠిలు పెఠిల్లను మ్రోతవెడల బగిలె గంబంబు భువనకంపంబు గదుర

స్క - పం - 81

నృసింహమూర్తి దితిపట్టి మీదకు విజృంభిచిన విధమున వీర, రద్రాములు పోషింపబడినవి. నరసింహమూర్తి, హిరణ్యకశిపుని పట్టుకొని చీల్చి ప్రేగులు మెడలో వేసికొని రక్తము మీదచల్లుకొనుట, భీభత్స రసపోషకము. వీరరౌద్రమూర్తి అగు నరసింహునిచూచి, రాక్షసులందరు భయ భ్రాంతులైన విధమున భయానకము పోషింపబడినది. ఈవిధముగ ఎట్టిన, వీరరౌద్రభయానక విస్మయాఖ్యరసములు అనుభోద్య భంగి భంగులనెపక మెసక నృసింహ పురాణమును నిఖిలభువన హృద్య ముగ రచించినాడు.

# ప్రహ్లాదచరిత్ర - రసనిర్వాహణము

సాహిత్యశాస్త్రకారులలో నధిక సంఖ్యాకులు భక్తిరసమేకాదనియు, భావమే అని సిద్ధాంతముచేసిరి. రూపగోస్వామి, మధుసూదన సరస్వతి అను ఇరువురు, భక్తికి రసత్వము ప్రతిపాదించిరి. భక్తిస్వరూపమును, త్రిమతాచార్యులు నిర్వచించిరి.

శ్లో. స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే
స్వాత్మతత్త్వాను సంధానం భక్తిరిత్య పరేజగుః (వివేకచూడామణి)

భగవద్రామానుజులు, శ్రీభాష్యములో కల్యాణగుణాత్మకమైన బహుధావిశిష్ట మైన ఎన్నిఆటంకములచేతను, కట్టుపడని నిరంతరప్రేమ ప్రవాహమేభక్తి. మధ్వా చార్యులు మాహాత్మ్యజ్ఞాన పూర్వకమై అన్నిటికంటె, గొప్పదై :మిక్కిలి బలమైన స్నేహమేభక్తి. దానివలన మాత్రమే ముక్తికలుగును. భగద్వియోగ దుస్సహత్వమే భక్తి. భక్తి మహోత్తమమైన ప్రేమరూపము. ఈధముగా భక్తిబహుధా నిర్వచింప బడినది. అది అనుభవైక వేద్యమైనది.

మధుసూదన సరస్వతి భక్తిరస విభావాదులను సమగ్రముగ నిర్వచించినాడు. భగవదాకార చిత్తవృత్తి భక్తి. రసమునకు స్థాయిభావము. దానికిని భగవద్రతికిని భేదములేదు. ఈచిత్తవృత్తికి ఫలము భగవద్రతియే. భగవంతుడు ఆలంబనవిభావముగా

భక్తితో శ్రీమహావిష్ణువు సాయుజ్యము పొందిరి. ఇంతకంటే విచిత్రవిరోధాభాస మున్నది. అన్నిటికంటె, వైరముతో తేలికగా విష్ణువును చేరవచ్చునని చెప్పి, దాని కుదాహరణము హిరణ్యకశిపుడు. అదియే పోతనగారి అభిప్రాయమని చెప్పవచ్చును.

వైరానుబంధనంబున
జేరిన చందమున విష్ణుజిరతర భక్తిం
జేరగరాదని తోచును
నారాయణ భక్తి నాచిత్తమునన్. తె. భా. 7-15

ప్రహ్లాదుని సంస్కారము, ఈ జన్మలోనిది కాదు. అది పూర్వజన్మ పరమ భాగవత, సంసర్గసమాగతంబైన ముకుందచరణారవింద సేవాతిరేకమని పోతన మనకు తెలిపినాడు అందుచేతనే, ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవుని, యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యాననిరతుడగుట తటస్థించినది. భాగవతములోని భక్తులతో పోల్చిచూచినయెడల ప్రహ్లాదుని భక్తి విశిష్టమైనది. గజేంద్రుడు, పురుషకారము వ్యర్థమైన పిదప ఆర్తుడై భగవంతుని ప్రార్థించెను. ప్రహ్లాదుడెన్నడును ఆర్తుడుకాడు. అతడు పురుషకారరహితుడు. నిత్యప్రసన్నుడు. విధి సంకల్పమే అతని సంకల్పము. గజేంద్రునకు, భగవంతుడు కలడా? లేదు అను సందేహము కలిగినది. ప్రహ్లాదునకు ఇట్టి సందేహములేదు భగవంతుని, నిత్యప్రసన్న భావమును చూరగొన్న మహామహి తాత్ముడు. గజేంద్రుడు, శాపగ్రస్తుడైన, సాధకుడు. ప్రహ్లాదుని సాధనము, పూర్వ జన్మలోనే పూర్తియై, ఈజన్మలో హిరణ్యకశిపున శిక్షింపనెంచిన భగవసంకల్పమునకు సాధనభూతుడైనాడు. అందుచేత ప్రహ్లాదుని భక్తి మహోన్నతమైనది.

నారద భక్తిసూత్రముల ననుసరించి భక్తి పదునొకండురీతులు. భగవంతుని కల్యాణగుణములను వర్ణించి ఆయన మహిమలను నిరంతరము, పరవశచిత్తముతో గానముచేయుచు, సంకీర్తనము గావించుట ఒకవిధమగుభక్తి. నారదాదులట్టివారు స్మరణమాత్రమున వివశులగుచు, నిరంతర భక్తిరసపానమున ఉన్మత్తులవలెచరించు ప్రహ్లాదులు ఒకరకమైన భక్తిమార్గమునకు చెందినవారు. పోతన మహాకవి ప్రహ్లాదుని చిత్రించిన మూర్తి వీక్షించినచో ఎవరికి కన్నులు కరువుతీరదు. హరిభావనామృత పానముచే మేనుమరచుట భక్తుల లక్షణము. భగవంతునికై ఒకవేళ ఏడ్చుచు, మఱియొక సమయమున నవ్వుచు భజనానందమున గంతులువేయుచు వారి ప్రవర్తన లోకమున అసహజముగానుండును. లోకదృష్టిలోవారు ఉన్మత్తులు. అట్టి ప్రహ్లాదుని భక్తిపారవశ్యము బహుధా వర్ణించి ఆ ప్రహ్లాదమూర్తిని మన కన్నులముందు నడ యాడునట్లు చేయుట మహాపుణ్య విశేషము.

కాంతికంటె, సూర్యప్రభయెట్లు బలవత్తరమో అట్లే తక్కిన రసములకంటె ఇది శ్రేష్ఠతరము.

"భక్త్యాభాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యానటీకయా"

భాగవతము చక్కగా నర్థముచేసికొనుటకు పాండిత్యముకాని, వ్యాఖ్యానము కాని, సరిపోదు. భక్తిమాత్రమే భాగవత పరమార్థము గ్రహించుటకు ఉత్తమోపాయము. భాగవత రచనోద్దేశ్యము విష్ణుభక్తి ప్రకటనము. వాసుదేవభక్తి ప్రధానమగు, భాగవతమునకు అనుకూలమే మతము, భారతదేశములోను, ఆంధ్రదేశములోను, ప్రాచుర్యమావరించిన కాలములోనే సంస్కృతాంధ్ర భాగవతములు వెలసినవని అభిజ్ఞుల ఊహ సముచితము. భాగవతముపేరు చెప్పినంతనే భారతీయులు, భక్తిభావముతో శ్రీమహావిష్ణువునకు అంజలి ఘటించుట, తరతరాలనుండి, అనూచానముగా వచ్చుచున్నది. పోతన, మహాభక్తుడు. భక్తుల కథలు, వర్ణించు అవకాశము కలిగినది. గ్రంథము, కథ, కవి ఈ మూడు ఒకచోట మనోహర సమ్మేళనము పొందుట తెలుగువారి సుకృతము. ఆ మాటయే పోతనగారును, నన్నయ, తిక్కనలు, భాగవతము నాంధ్రీకరింపకుండుట మత్పురాకృత సుకృతమని చెప్పినాడు. చెప్పుటయేకాదు. చేసి కృతార్థుడైనాడు. పోతనతో దీటుగ, ఆంధ్రదేశమున భక్తిరసవాహినులను ప్రవహింపచేసిన మఱియొక కవి లేడు. ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షము, అంబరీషునికథ. రుక్మిణీ కల్యాణము మొదలైనికథలు ఆంధ్రులకు నేటికిని పారాయణమగుట, విశేషము. ప్రహ్లాదచరిత్ర, భక్తిరసమునకు మకుటాయమానమైనది. దానికి లక్ష్యము లక్షణము ప్రహ్లాదుడే అని, పరమరమణీయముగ నిరూపించినాడు. ఇందు, నవవిధ భక్తులను మూలానుగుణముగ చక్కగ ననువదించెను.

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వం
దనా, ర్చనముల్ సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీ
ర్తనల్, చింతనం, బనునీ, తొమ్మిది భక్తిమార్గముల సర్వా
త్మున హరిన్ నమ్మి, సజ్జనుడై యుండుట భద్రము.
మంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా. తె. భా. 7-197

కథాప్రారంభముననే శ్రీమహావిష్ణువును భక్తులు ఏ ఏ విధముగా సాయుజ్యము పొందిరో ఈక్రింది పద్యములలో చక్కగా పోతన సూచించినాడు.

గోపికలు, కామోత్కంఠతో, కంసుడు, భయములే, శిశుపాల ముఖ్య నృపతులు, వైరముచే, వృష్ణ్యాదులు బాంధవ్యముతో, ధర్మజాదుల ప్రేమతో, నారదాదులు

భావము. అనుభావము ఊహించుకొనవచ్చును. ఇటశాంతము భక్తికి అంగముగా వర్ణించుట మనోహరము.

భక్తిమహిమాతిశయమును ఎన్నివిధముల అందముగా చెప్పవచ్చునో అన్ని విధముల సర్వజన హృదయంగమముగ, వర్ణించినాడు. ఆభక్తకవివలె, భక్తిరస మును, మరొకకవి వర్ణించలేడని చెప్పవచ్చును, సకలజన్మలందు మానవజన్మ దుర్లభము. ఆమానవుడు ఏషణత్రయములో, పడి తెలిసికొనవలసిన కర్తవ్యమును విస్మరించి సంసారబంధములోచిక్కుకొని, దిక్కుతోచక, కొట్టుమిట్టాడుచున్నాడు. దానికిఉపాయము, ఉపేయముహరిభక్తియే, కానిఅన్యముకాదు. హరిభక్తిలేనివారికి ఎన్నిభోగములున్నను, ప్రయోజనములేదు. సర్వశాస్త్రములు శోధించినను, తెలిసికొనవలసినది ఈచరాచర ప్రపంచమంతయు విష్ణుమూర్తి దివ్యస్వరూపమని గుర్తించుటయే. చదువులలోమర్మమిది

శా॥ శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాధ వే యేటికిన్
గాధల్మాధవశేముషీ, తరణి సాంగత్యంబునంగాకదు
ర్మేధన్దాటగవచ్చునే సుతవధూమీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాల సంసృతిమహాఘోరామితాంభోనిధిన్　　తె॥ భా_7-183

దుస్సహసంసార భయంకరత్వమును అత్యంతభయంకరమైన సముద్రముతో పోల్చి ఆసముద్రమును, దాటుటకుమాధవశేముషీసాంగత్యమే ఉత్తమోపాయమని శార్దూలపద్యములో సూచించినాడు. భగవత్కైంకర్యముచేతనే సంసారకష్టములు తొలగును. భగవత్సేవచేతనే తాపత్రయంబులు సమసిపోవును.

సీ॥ సంసారజీమూత సంఘంబువిచ్చునే
　　చక్రిదాస్యప్రభంజనములేక
తాపత్రయాభీలదావాగ్నులాఱునే
　　విష్ణుసేవామృతవృష్టిలేక
సర్వంకషాఘౌఘజలరాసులింకునే
　　హరిమనీషాబడబాగ్నిలేక
ఘనవిపద్గాంధాంధకారంబులడగునే
　　పద్మాక్షునుతిరవిప్రభలులేక
నిరుపమాపునరావృత్తినిష్కళంక ముక్తినిధిగానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనములేక తామరసగర్భునకునైనదానవేంద్ర

తె॥ భా॥ 7-171

సీ॥ అడుగడుగునకు మాధవానుచింతన సుధా
మాధుర్యమున మేనుమఱచువాని
సంభోజ గర్భాదు లభ్యసింపలేని
హరిభక్తి పుంభావమైవాని
మాతృగర్భము సొచ్చిమన్నది మెదలుగ
జిత్తమచ్యుతుమీదజేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీవిష్ణుమయ, మనిచెలగువాని
వినయకారుణ్య బుద్ధివివేక లక్షణాది గుణములకా టపట్టయినవాని
శిష్యబుధలోక సంభావ్యు జేరిగురుడు .... .... ... ... ....

సీ॥ వైకుంఠ చింతావివర్జిత చేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనా రూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణు డింతియగాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను విధానముగంటినేనని
యుబ్బిగంతులువైచు నొక్కచో. తె. భా. 7-124.

శ్లో॥ పునర్విశ్లేషభీరుత్వం పరభక్తిరుచ్యతే.

భగవంతుని సాన్నిధ్యము క్షణమైనను, ఎడబాయుటకు ఓర్వజాలకుండుట పరమభక్తియని చెప్పబడినది. ఎడతెగని, హరిధ్యానము కుదిరినయెడల సంతోషాతిశయము కలిగి శ్రీహరికల్యాణ గుణములను గానము చేయుచుండును. ఇది ధృతియను సంచారీభావము. భగవంతుడు వ్యాపింపక, ఉండు వస్తువు, పరమాణువైనను లేదనీ ఎంచి గట్టిగనవ్వుచుండును. ఇది హాసమను సంచారీభావమునకు, శ్రీపుండరికాక్షుడను నిధి దొరకినదని అని ఎగురుచుండును ఇది హర్షమను సంచారిభావము. తనకు ప్రత్యక్షమైన, భగవంతునితో, కూడి, ఒక్కొక్కయెడ మాటలాడుచు ఆనందబాష్పములచే, తడిసినదేహము కలవాడై రోమాంచముకలవాడై, కనురెప్పల మూతపడినవాడై కదలకుండ నిలచి, పలుకనివాడై ఉండును. ఇక్కడ, స్తంభ, ప్రళయ, రోమాంచ అశ్రువులను, సాత్వికభావములు చెప్పబడినవి. భగవత్సాక్షాత్కారము ఉద్దీపనవి

కమలేశుజూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక
చక్రిచింతలేని జన్మంబు జన్మమే తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే ? పాదయుగముతోడి పశువుగాక
తె భా। 169 170 సప్తమ

ఈ విధముగ పోతనరసవత్తరమగు తనకవితాసుధతో ప్లావితము చేసి భక్తి భావమహోన్నత్యము తెలుగుదేశము నాలుగు చెరగులందు విస్తరింప చేసినాడు. భక్తి గంగాప్రవాహమును ఇందుఅత్యద్భుతముగ ప్రవహింపచేసిన కవిపుట్టలేదనిఘంటాఘోష ముగ చెప్పవచ్చును

పోతనార్యుడు భక్తిరసముతో పాటుశృంగారాదిరసములను సర్వాంగసుందరముగ పోషించినాడు. హిరణ్యకశిపునియందు వీరరసముచక్కగా పోషింపబడినది. కరుణ రసమునకు స్థాయిభావము ఇష్టజననాశముచే కలిగిన దుఃఖము. ప్రాసంగికేతి వృత్తమును, ప్రేతబంధు యమసంవాదమున సుయజ్ఞుడను రాజుశత్రువులచే, సంహరింప బడగా అతనిభార్యలు విలపించిన విధము కరుణరసనిర్భరము.

మ॥ అనఘా నిన్నుసుశీనరప్రజల కర్థానంద సంధాయిగా
మునునిర్మించిన బ్రహ్మనిర్దయత నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికిమాకు దిక్కుగలదే ధాత్రీశసిబోటికిం
జనునే పాసిచనంగభ్రాతృజనులన్ సన్మిత్రులంబుత్రులన్ తె॥ భా-7 43

## అద్భుతరసము

దీనిస్థాయిభావము విస్మయము అపూర్వవస్తు దర్శనమున కలుగు చిత్త విస్తరమిది. నృసింహావిర్భావమున పోషింప బడినది. దశదిశలను మిడుంగురులు సెదరంబెటిలిపడి బంభజ్యమానంబగునమ్మ హా స్తంభంబువలన, ప్రళయవేళాసంభూత సప్తస్కంధబంధుర సమీరణసంఘటిత ఘోరరజోఘుష్యమాణ మహావలాహక, వర్గనిర్గత నిబిడ విష్ఫురదుస్సహా, నిర్ఘాతసంఘనిర్ఘోషనికాశంబులైన చటచ్చటపృటధ్వనిప్రముఖ, భయంకరారావ పుంజంబులు జంజన్యమానంబులయియెగసియాకాశ కుహరాంతరంబు నిరవకాశంబుసేసి ని:డిన తె భా-7-285

శ్రియఃపతియగు, భగవంతుడు అనాదికర్మబద్ధులగు చేతనులయందు నిర్హేతుక జాయమానకటాక్షముగలవాడై వారికిదే హేంద్రియాదులనొసంగిఅట్టిదేహేంద్రియాదులచే, తన్నారాధించు వారికి కర్మబంధంబులు వదలించుకొని సర్వాంశసర్వకాల సర్వావస్థల యందు భగవత్ కైంకర్యపరులై తత్కృపాపాత్రులగుదురు. సర్వావయవములు సర్వేశ్వరసేవకే వినియోగించవలెను.

శ్రీకులశేఖరాళ్వారులు ఈఅర్థమును తెలుపునట్టి ఒకమనోహర శ్లోకమును రచించిరి.

శ్లో॥ జిహ్వేకీర్తయకేశవం మురరిపుంచేతోభజశ్రీధరం
పాదద్వంద్వసమర్చయాచ్యుతకథశ్శ్రోత్రద్వయంత్వంశ్రుణు
అనుశ్లోకమును తలపించుచున్నది
ఈభావమును పోతనమహాకవి ఇందుమనోహరముగ చిత్రించినాడు.

సీ॥ కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిదవిలిన మనము మనము
భగవంతువలగొను, పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
దేవదేవుని జంతించు దినము దినము చక్రహస్తునిప్రకటించు చదువు చదువు
కుంభినీధవుజెప్పెడి గురుడు గురుడు తండ్రి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి

సీ॥ కంజాక్షునకుగాని కాయంబుకాయమే
పవనకుంభితచర్మభస్త్రిగాక
వైకుంఠుబొగడని వక్త్రింబువక్త్రమే
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక

సాహిత్యమున రసపోషణమందు నన్నయ, తిక్కనల తరువాత ఎఱ్ఱననే చెప్పవచ్చును. రసపోషణమున అతడు కృతహస్తుడు. శృంగారరసపోషణమున తరువాతి యుగములలో ప్రబంధకవులు పోయిన వెఱ్ఱిపోకడలను చూచినచో ఎఱ్ఱన రసపోషణమున ఎంత సంయమనము ప్రదర్శించెనో సహృదయులకు స్వయంవ్యక్తమగును. ఆయన పోషించిన శృంగారము సత్త్వగుణశోభితము. పార్వతీపరమేశ్వరుల, లక్ష్మీనారాయణులశృంగారము జీవేశ్వరైక్యము, బోధించు సముదాత్తశృంగారము. ప్రథమాశ్వాసమున అతడు పోషించిన, శృంగారము దివ్యమైనది. అంగిరసముగా శాంతమును, భక్తిని అంగర సముగను, పోషించెను. శాస్త్రకావ్యమైన భారతమున, శాంతరసము, అంగిరసమనియు, మోక్షపురుషార్థము ప్రతిపాదింపబడినట్లు అలంకారికమూర్ధన్యుడగు ఆనందవర్ధనుడు సర్వజనానందవర్ధనముగనుడివెను. అట్లే ఎఱ్ఱన, నృసింహ, పురాణమున శాంతమును అంగిరసముగను, శృంగారాదులను అంగరరసములుగను పోషించెను. వాసుదేవ పరబ్రహ్మమునందు భావితచేతస్కులగు నట్లు సామీప్యసాయుజ్యాది రూపమోక్షము భక్తిచేత పొందవచ్చునని నిరూపించిరి.

ఆంధ్రకవులలో భక్తిరస పోషణములో పోతనదే అగ్రతాంబూలము. అటనట, రసపోషణముచేయుటలో అతిమాత్రమునకు పాల్పడుట పోతనలో గోచరించును. దానికి కారణము, అతడు భక్తకవి అగుటచేతను అతని కవిత ఆత్మాశ్రయకవితాశాఖకు చెందిన దగుటచేతను, ఈగుణము అతనికవితకు అలంకారమేకాని మఱొకటికాదు. ఏరసముపోషించినను, పోతన దానియందు తాదాత్మ్యము పొందుట, శరద్రాత్రిలో యమున ఉప్పొంగినట్లు పోతనహృదయము రసపోషణమున ఉబ్బిగంతులు వైచును. భక్తిరస పోషణమున పోతనతో, సమానప్రతిపత్తి కలిగిన కవి నభూతోన భవిష్యతి అని చెప్పవచ్చును. ఆంధ్రులందరు పోతన భక్తికవిరచితాంజలి ఘటించుట త్రైకాలిక సత్యము. భక్తి అనగా పోతనయే.. విష్ణుభక్తినిగూర్చి పోతన అందముగా చెప్పిన సూక్తులు ఆంధ్రులందఱకు నిత్యపారాయణము.

1. మందార మకరందమాధుర్యము దేలు మధుపంబు వోపునే మదనములకు
2. అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేష నుత్త
   చిత్తమే రీతినితరంబుజేరనేర్చు
ఉ. అచ్చపుజీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
   చచ్చుచు బుట్టుచున్ మరల జర్వితచర్వణులై నవారికిం
   జెచ్చెరఁబుట్టునే పరులు సెప్పిననైనని జేచ్చనైన నే

## రౌద్రరసము

క్రోధము దీనిస్థాయి భావము శత్రుకృతా పచారముచే కలిగిన మనఃప్రజ్వలనము. హిరణ్యకశిపునిఉగ్రక్రోధమును సూచించునట్లు రౌద్రరసము పోషింపబడినది.

పాదతాడితంబైన భుజంగంబుభంగి, పవనప్రేరితంబైన దావనలంబుచందంబున, దండతాడితంబైన కంఠీరవంబుకై వడిభీషణరసావేశ జాజ్వల్యమానచిత్తుండును, పుత్రసంహారోద్యోగ యుక్తుండును, కంపమానగాత్రుండును అరుణీకృతనేత్రుండునై క్రోధోద్రిక్తుడగుదైత్యవల్లభుని స్వరూపమిందు భీషణముగవర్ణింపబడినది. ప్రహ్లాదునితో నతడు విష్ణుధిక్కారముచేయుట చూడుడు

శ్లో॥ నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండునాకంటెనీ
భూతశ్రేణికిరాజులేడొకడు సంపూర్ణ ప్రభావుండున
ద్ధ్యాతంజంపినమున్నె వెదకితిం బల్మారునారాయణుం
డేతద్విశ్వములోనలేడు మఱివాడెందుండురాదుర్మతీ తె॥ భా 7 271

దైత్యేంద్రుని క్రోధపరమావధి ఎంత తీవ్రమైనదోసువ్యక్తమగుచున్నది.

## శృంగారరసము

భాగవతగత శృంగారరసము కామకాలుష్యరహితమై లౌకికవాసనాతీతమై అత్యంతస్వచ్ఛమై బ్రహ్మానందసహోదరమై అలరారుట విశేషము. ప్రహ్లాదచరిత్ర యందు ఉగ్రనరసింహమూర్తిని చేరుటకు లక్ష్మీదేవి పొందినభయమును మనోహరముగా వర్ణించి యున్నాడు.

పరికయార్కబింబంబుపగిదినున్నది గాని
నెమ్మోముపూర్ణేందునిభముగాదు
.... ... ... ... ....
గన్నదియుగాదు భీషణాకారమనుచు తె భా_7_342

ఈవిధముగ పోతనప్రహ్లాదచరిత్ర యందు భక్తికి పట్టాభిషేకము చేసియు శృంగార, వీర, అద్భుత, కరుణాదులను సర్వాంగసుందరముగా పోషించినాడు,

## రసనిర్వహణమున, ఎఱ్ఱనకు – పోతనకు గలభేదము

ఎఱ్ఱన నృసింహపురాణమున నవరసములను సమానప్రతిపత్తితో వర్ణించెను. భావనిగ్రహము, సత్వగుణము, ఔచిత్యములు శంభుదాసునికి నిసర్గములు అంధ్ర

# పాత్రచిత్రణము

ఎఱ్ఱన, పోతనలు చిత్రించిన పాత్రలు సజీవరూపరేఖా విలాసములతో ఉన్మీల నముచేందిన విశిష్ట వ్యక్తిత్వముతో, వైవిధ్యముతో మన కన్నుల ఎదుట సాక్షాత్కరించును. పాత్రచిత్రణము, ప్రత్యక్షమనియు, పరోక్షమనియు, ద్వివిధము. కథాకథన ముఖమున పాత్రచిత్రణము చేయుట, ప్రత్యక్షపద్ధతి, శ్రవ్యకావ్యకర్తలు ప్రత్యక్ష పరోక్షపద్ధతులు రెండింటి నవలంబించి పాత్రచిత్రణముచేయు నవకాశము కలదు.

ఎఱ్ఱన, పోతనలు, వివిధ పాత్రలను పోషించుటలో భేదముచూపిరి. ఇరువురు హిరణ్యకశిపు, ప్రహ్లాద, జయ, విజయులను, బ్రహ్మాదులను చిత్రించినను, ఎవ్వరి, వ్యక్తిత్వము వారిది. ఎవరి సొంతగొంతుక వారిది.

## హిరణ్యకశిపుడు

ఎఱ్ఱన-హిరణ్యకశిపుని, ధర్మవిద్వేషునిగ, కల్మషకారునిగా, దుష్టమోహావిలబుద్ధి కలిగినవానిగా, త్రిలోకాధిపత్యము తనకే దక్కవలెనని తలపోయు స్వార్థమూర్తిగ, దుర్నివార పరాక్రమసంపన్నునిగా చిత్రించెను. అతడు కేశవ పక్షపాతియైన, ప్రహ్లాదునిలో ప్రతిక్షణము పరివర్తనము తెచ్చుటకు ప్రయత్నించెను.

సనక, సనందాదులు, జయవిజయులను, ధర్మవిద్వేషులు, కల్మషకారులు, దుష్టమోహావిలబుద్ధితో రాక్షసులై, జయింపుడనియు సంతతము లక్ష్మీవిభుమీద మత్సరము, దినుకకారియి, బెట్టుననియు శపించిరి.

హిరణ్యకశిపుడు పుట్టుకతో, అసమాన్య శౌర్యప్రతాపసంపన్నుడు. కనలిపోవు బింకపుకింకవలన, కలిగిన వేడిమిరూపెత్తినట్లు కోపప్రల్లదమువలన పోడిమి శరీరము ధరించినట్లు విజృంభించి, ప్రళయకాలదహనునివలె తేజరిల్లెను. ఆగమములను ద్వేషించెను. ధర్మమును రోషించెను. మత్సరోద్ధతిని పోషించెను. మదాతిరేకముతో చరితమును భూషించెను.

అమరు లనిన జంపనలుగు హవ్యాహారు
లనిననోరికల్ల గొనఁగదలఁచు
త్రిదివవాసులనిన నదుమంగఁజూచుఁ బా
తాళమునకు దేవతలనతండు. నృ - ద్వి - 5

మిచ్చినదైన గానలకు నేగినదైన హరిప్రబోధముల్.
కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్
గానని భంగిగర్మములుగైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁగొందఱట గందుర, కించనవైష్ణవాంఘ్రిసం
స్థాన రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా.

తె॥ భా - 7-191 17

హరిభజనంబున మోక్షంబుసిద్ధించు విష్ణుఁడు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు ముముక్షువైన దేహికిదేహావసానపర్యంతంబు నారాయణచరణారవింద సేవనంబుగర్తవ్యంబు,

గురుశుశ్రూషయు, సర్వలాభసమర్పణంబును, సాధుజన సంగమంబును ఈశ్వరప్రతిమారాధనమును. హరికథాతత్పరత్వంబును. వాసుదేవుని యందలి ప్రేమయు, నారాయణ గుణకర్మ కథానామకీర్తనంబును, వైకుంఠచరణకమల ధ్యానంబును విశ్వంభరమూర్తి విలోకనపూజనంబులును, మొదలయిన విజ్ఞానవైరాగ్యలాభ సాధనంబులైన భాగవత ధర్మంబులు.

సీ. దనుజారి లీలావతారంబులందలి
 శౌర్యకర్మంబులు సద్గుణములు
 విని భక్తుడగువాడు వేడ్కతోబులకించి
 కన్నుల హర్షాశ్రుకణము లొలుక
 గద్గదస్వరముతో గనులార వైకుంఠ
 వరద నారాయణ వాసుదేవ
 యనుచు నార్తిలిపాడు నాక్రోశించు
 నగుచింతనముసేయు నతియొసర్చు
 మరులుగొని యుండు దనలోన మాటలాడు
 వెల్పుసోకిన పురుషుని వృత్తిదిరుగు
 బంధములఁ బాసి యజ్ఞానపటలిగాల్చి
 విష్ణుబ్రాపించుదుది భక్తి వివశుతగుచు. తె॥ భా - 7-240.

ఈవిధముగ భక్తిమహమాతిశయమును పోతవ బహుగుణరమణీయముగ బహువారములు గానముచేసెను. ఎట్టినయు భక్తిరసమును పోషించినవిధము శాస్త్రజన్య జ్ఞానమును ప్రవచించు యోగీశ్వరుని ప్రబోధమువలె, నడచినది. పోతన ప్రవహింపచేసిన భక్తిమందార మకరందములో ఆంధ్రులు తలమున్కలుగా స్నానముచేసిరి.

ఉత్తమజనకునిగ గోచరించును. అతనిలోని ప్రధానదోషము విష్ణుద్వేషము. అతనికి ఎంత విష్ణుద్వేషమున్నదో అంత పుత్రప్రేమ యున్నది.

ఈ రెంటికి జరిగిన సంఘర్షణముచే అతనిలో కలిగిని మానసికక్రమపరిణామము పోతన చిత్రించెను

ఎఱ్ఱన చిత్రించిన హిరణ్యకశిపునివలె, పోతన చిత్రించిన హిరణ్యకశిపుడు, అజన్మద్వేషము పెంచుకొనలేదు. హిరణ్యకశిపునియందు నెడనెడ సాత్త్వికస్వభావము గోచరించును. ఎఱ్ఱన, గారి, హిరణ్యకశిపుడు విష్ణువుపై అజన్మద్వేషము పెంచుకొనగా, పోతనగారి హిరణ్యకశిపుడు, ప్రియానుజుడైన హిరణ్యాక్షు, విష్ణుమూర్తి సూకర రూపము వహించి, సంహరించెనని ద్వేషము పొందెను. హిరణ్యకశిపుడు మాటనేర్పు కలవాడు, మాటయే తీయని నెయ్యమును పెంచును. కవ్వించును. నవ్వించును, బుజ్జగించును; ఓదార్చును శబ్దశక్తి చాలదొడ్డది. హిరణ్యకశిపుడు, కూర్మితమ్ముని, వధను, విని, దైత్యదానవులను సమావేశపఱచి, వారిని విష్ణువుపై ప్రతీకారము తీర్చుకొనునట్లు చేసినవిధము నాటకీయమై అలరారుచున్నది.

శా. నాకుందమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృత దేవయక్షుడు హిరణ్యాక్షుండువానిన్మహా
సౌకర్యాంగము దాల్చిదానవవధూ సౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించిపోయెనట యీవార్తార్థతిన్ వింటిరే.

తెII భా - 7-30

మిత్రులారా! నాకు తమ్ముడును, మీకు ప్రియసఖుడును, రణన్యాయైక దక్షుడును అగు హిరణ్యాక్షుని, విష్ణువు కేవలవరాహరూపముచేత సంహరించిపోయినాడు. ఈవింతమాటను వింటిరే. ఇట్టి శత్రువును ఉపేక్షించి ఉండతగునా? ఇది తిక్కనగారి నాటకీయసంభాషణాచాతుర్యము తలపించుచున్నది. భాగవతమున కొన్నిఘట్టములందు దురహంకారులును, గర్వితచిత్తులను, అయిన, భగద్విరోధులుకొందరు శ్రీమహావిష్ణువును నిందించు ఘట్టములు అటనటవచ్చుచుండును. అట్టియెడ భక్తశిఖామణియైన పోతన వానినికూడ రచింపవలసియుండుటచే, అతడు అట్టి పట్టులద్భుతమైన వ్యంగ్యవైభవమును ప్రకటించుచుండును. అట్టి పద్యములను పఠించుచో, స్తుతియు, నిందయు, రెండును సమానాంతరముగ ప్రహించుచుండును. నిందాపక్షము దుష్టపాత్రలది. స్తుతిపక్షము, భక్తకవియగు పోతనది. ఈపద్యములు రచించుటలో పోతన ప్రదర్శించిన హృద్యమైన వ్యంగ్యవైభవము అనన్యసాధ్యమైనది. అది సహృదయులను ఆనంద

ఇట్లు హిరణ్యకశిపుడు ప్రకృతి పారుష్యదూష్యుడై ప్రవర్తిల్లెను. దైత్యులు, అదితేయులు ఒకతండ్రి బిడ్డలు. కాని తల్లులు వేరు. దితి, అదితి, కంటె పెద్దది. అందువలన, దితిపుత్రులైన, దైత్యులకు రాజ్యాధిపత్యమున హక్కు ఎక్కువ ఉన్నది. త్రిలోకరాజ్యభోగములు, దైత్యులకే దక్కవలెను. ఇది అతని విచారధార.

అమరుల తల్లికంటెను మదంబవరిష్ఠ త్రిలోకరాజ్యభో
గములును, వారియోగ్యములుగాని నిలింపుల కెట్లుగల్గుసు
ద్యమ గరిమంబుమై సురలనందఱ ద్రుంచుట బోలె దీర్ఘవదం
డమునను జంపియేన తగదక్కగ నేలుదు లోకమంతయున్.

నృ - ద్వి - 8.

సామాన్యముగా, ఆవేశపూరితులకు ఆలోచన తక్కువగా నుండును. దానికి అపవాదము హిరణ్యకశిపుడు, మనోరథము సిద్ధింపచేసికొనుటకు దేవతలను ఓడించుటకు, త్రిలోకాధిపత్యము పొందుటకు కేవలము భుజశక్తి సరిపోవదనియు, తపస్సుచే ఎంతటి దుష్కరకార్యమైనను సాధింపవచ్చునని భావించెను.

కావున నుగ్రపు దపమున
గావించెద దపముచేత గానివికలవే నృ - ద్వి - 9

సీ. అమర పదంబును నమరేంద్రపదము
తపంబను భూజంబుపండ్లుగావె
సప్తర్షిపదము భాస్వత్ ధ్రువపదమును
దపమను పువ్వుగంధములుగావె
... ... ... ... ... ...
ధర్మార్థ కామమోక్షములకెల్ల దపము సాధన మగుటసిద్ధంబకాదె.

నృ - ద్వి - 10

ఎట్లున చిత్రించిన, హిరణ్యకశిపుడు కొంచెము అనాగరికుడు, మోటుమానివిగా గోచరించును.

## పోతన –

భాగవతమున హిరణ్యకశిపుడు విషాదాంత నాయకునివలె గోచరించును. దర్పోద్ధతి, రోషము, ప్రతీకారపరాయణత్వము భ్రాతృవాత్సల్యము, కలవాడుగ, వేదాంత విజ్ఞానవిదునిగ, అచంచల దీక్షాసంపన్నుడుగ, పుత్రాభ్యుదయముకొఱకు ప్రతిక్షణము కంటికి తెప్పవలె, ప్రవర్తించువాడుగ, కన్పించును. ఆర్ద్రిత, ఆత్మీయతనిండిన

సింహమువలె, నన్ను ఎదిరించినను, లక్ష్యపెట్టక నాశూలముతో వానిని చంపి, వాని రక్తముతో, నాతమ్మునకు తర్పణముచేసి, మెఱసివత్తును. మీకు మేలుదెత్తును. ఇందు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహావతారముల వైభవము వ్యంగముగా సూచించినాడు. విష్ణుభక్తులకు దశావతారస్తోత్రము చేయుటకు మిక్కిలి మక్కువపడుట సంప్రదాయము. పోతన, హిరణ్యకశిపుని, నిందావాక్యములలో అన్యాపదేశముగ, దశావతారస్తుతి చేయుట మనోహరము.

హిరణ్యకశిపుడు, సోదరుని మరణానంతరము కడుదుఃఖితుడై, సోదరునకు ఉదకప్రదానాది కార్యములాచరించి, హిరణ్యాక్షుని భార్యలను, పుత్రులను, తల్లిని రావించి, బుజ్జగించుచు, ఇట్లుపలికెను సామాన్యముగ హిరణ్యకశిపుడు దుర్మార్గుడని మనఊహ. ఏవ్యక్తియు, సంతతము మంచివాడుగా గాని, దుర్మార్గుడుగా గాని ఉండడు. పరిస్థితులే వ్యక్తిని మంచివానిగ, దుర్మార్గునిగా చేయును. ఆయాసన్నివేశములలో పాత్ర స్వభావానుగుణముగా స్పదించును. పరమ దుర్మార్గుడని పేరు పొందిన హిరణ్యకశిపుని ముఖమునుండి వేదాంత సుధాసార వర్షము కురియుట, మనకు ఆశ్చర్యముకలిగించును. ఆతనిమాట ఉపనిషత్ప్రతిపాదితము.

శా. నీరాగార ని విష్టపాంథులక్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు గూడిపిత్తురు సదా సంగంబు లేదొక్కచో
శూరుర్ వోయెడి త్రోవబోయెను భవత్పూనుండుదల్లీ మహా
శూరుండాతడు తద్వియోగమునకున్ శోకింపనీకేటికిన్ తె. భా. 7 38

సీ. సర్వజ్ఞుడీశుండు సర్వాత్ముడవ్యయుం
దమలుండు నిత్యుడనంతుడాద్యు
డాత్మరూపంబున నశ్రాంతమును దన
మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున
లింగశరీరంబు లీలదాల్చి
కంపిత జలములో గదలెడి క్రియదోచు
పాదపంబులభంగి భ్రామ్యమాణ
చక్షువులధరిత్రి చలితయై కానంగబడిన భంగివికల భావరహితు
డాత్మమయుడు గంపితాంతరంగంబున గదలినట్లు తోచుగదలకుండు
తె. భా. 7—39

సంధాయకము. హిరణ్యకశిపుడు, రాక్షసులను, విష్ణుమూర్తిపై ప్రతీకారముచేయుటకు కవ్వించు మాటలో ఇది స్పష్టము.

చ. వనముల నుండజొచ్చు మునివర్గములోపల సంచరించు సం
జనన మెఱుంగ రెవ్వరును జాడయొకించుకలేదు తన్నుడా
సిన మతిడాయు వెంటబడిచిక్కక చిక్కడువీని నొక్కకి
లున మనమెల్లలోబడిక లోబడక బట్టుకొనంగవచ్చునే తె॥ భా - 7-31

దానవులారా విష్ణుమూర్తిని పట్టుకొనుట అసాధ్యమైన పని, ఏలయన అతడు అడవులతో నుండును. మునుల హృయాంతరస్థితుడై యుండును. అతని పట్టుక ఎవరికిని తెలియదు. అనేకవిధంబులనుండువాడు. తనయొద్ద చేరువారికిగాని చిక్కడు. ఇట్టివానిని ఏఉపాయముచేత, మనము పట్టుకొనగలము. ఇది బాహ్యార్థము. భగవంతుడు రమణీయములగు వనాంతరములందు మహాతపస్సంపన్నులగు, మునులకు యోగ దృష్టిచే తెలియదగినవాడు. అనాదియగువాడు. సర్వస్వరూపుడు ఆశ్రితులకు అను కూలుడు. ఇట్టి భగవంతుని కనుటకు మనము సమర్థులమా? అని వ్యంగ్యార్థము ఇట్టి మాటలను పరిశీలించినపుడు హిరణ్యకశిపునకు పూర్వజన్మ జ్ఞానము అంతరాంతములలో ఉన్నదా? అనిపించును.

సీ. భుజశక్తి నాతోడ బోరాడ శంకించి
మున్నీట మునిగిన మునుగుగాక
యిలయించి పెనగునా యచల సంభ్రమమున
కెఱగి వెన్నిచ్చిన నిచ్చుగాక
జగడంబుసైపక సౌకర్యకాంక్షియై
యిలక్రింద నీగిన నీగుగాక
క్రోధించి యటుగాక కొంత పౌరుషమున
హరిభంగినదరిన నడరుగాక

కఠినశూలధార గంఠంబు విదళించి వాని శోణితమున వాడి మెఱసి
మత్సహోదరునకు మహిదర్పణముసేసి మెఱసివత్తు మీకు మేలుదెత్తు
తే. భా- 7-32

విష్ణుమూర్తి, నాతోడపోరాడ శంకించి మున్నీటమునిగినను, భయపడి పారి పోయి సముద్రములో మునిగినను, నేను వదలిపెట్టను. పౌరుషముతో నెదుర్కొని

పోతన, చిత్రించిన హిరణ్యకశిపుడు ఏధ్యేయమును మనసులో నిడుకొని తపస్సు చేసెనో వానినన్నింటిని సాధించుకొనెను.

వరదాన గర్వితుడైన హిరణ్యకశిపుడు తన ముఖ్యపట్టణమైన రత్నావతికేగు దెంచెను. అతని ఐశ్వర్యము శుక్లపక్షచంద్రునిమాడ్కి దిన దినాభివృద్ధి చెందెను. అతడు దిక్పాలకులపై దండెత్తెను. ఇంద్రుని తలపట్టి ఈడ్చెను. అమరావతి పురమును చూరాడి సురకాంతల చెరపట్టెను. అగ్నిదేవుని శిఖలు చూపకుండ శిక్షించెను. హవికి నోరుతెరవకుండ మేరపెట్టెను. పీతిహోత్రుని భీతిపాత్రునిచేసెను. యమునిచూచి ఉల్లసమాడెను.

ఓహో! పేదల ప్రాణాలుతీసికొను బిరుదు మగడవా? అని అతని మోము మీద చప్పట్లుకొట్టెను. పవమానుని అవమానముపాలు చేసెను. ఎల్లరను, ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరుత్రాగించెను. ఒక ఈశ్వరుని జోలికిపోలేదు కనికరించి.

ఉ. ఎక్కడిదెద్దు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్షజీవనం
బొక్కటి కట్టజీరయును నుండగనిల్లును లేదునిక్కువం
బిక్కఅకున్దపస్వి జనుదేచిన నయ్యెడు నేమియంచు దా
నొక్కనిశర్వుని న్బరుపనొల్లడు దైత్యుఁ డ నాదరంబునన్ నృ-2-124

గంధర్వుల చేతివీణలు పిశాచులకిచ్చి పాడించినాడు. బక్కచిక్కిన వృద్ధ తపస్వులకు అచ్చరపడుచులనుఇచ్చి పెండ్లి చేయించినాడు. భువన బాధలు అతనికి ప్రొద్దువోకలుగా నున్నవి. ఇవన్నియు అతని మాత్సర్యమునకు అనుదాత్తప్రకృతికి నిదర్శనములు. అతడుపుట్టుకతోనే దుర్నిరీక్ష్య పరాక్రమ సంశోభితుడు. క్రోధమూర్తి, ధర్మవిద్వేషుడు, కల్మషకారుడు. అట్టి వానికి అగ్నికి వాయువు తోడ్పడినట్లు బ్రహ్మ వరములును లోకోపద్రవకారణ మయ్యెను. దానితో నేయివోసిన అగ్నివలె హిరణ్య కశిపుడు అనివార్య విజృంభమాణుడయ్యెను.

## పోతన:

పోతన చిత్రించిన, హిరణ్యకశిపునకు సోదరుని చంపినపగ చల్లారలేదు. ప్రతీకారము, అతనిని, జంత్రపు బొమ్మవలె ఆడించినది. అతడు, ఒకనాడు గంధర్వ యూథమును పరిమార్చెను. ద్విజులను పలాయనము చిత్తగించునట్లు చేయును. అంబు జోదరునిపై వైరము ఇనుమడించుచున్నది. అతడు చేసిన, అప్రతిమానమైన ప్రతీకార మునకు దేవతలందరు ఎట్లు తల్లడిల్లిరో, ఒక శార్దూలపద్యమున సూచించెను.

సంసారులగువారు చలివేంద్రలో కూడిన బాటసారులవలె, కొంతసేపు కలసికొని పోవుచుందురు. ఎల్లప్పుడు కలసియుండరు. నీకొడుకు హిరణ్యాక్షుడు మహాశూరుడు పోయెడి త్రోవను వెదలి వీరమరణము పొందెను. అట్టి వానినిగూర్చి నీవు చింతింపనేల ? ఆత్మ నిత్యము. కర్మభేదమునుబట్టి శరీరభేదము లేర్పడుచున్నవి. కదలుచున్న నీళ్ళలో కనపడు చెట్లనీడలవలె, మన మనస్సు చలించుచున్నది. కనుక ఆత్మచలించుచున్నదని తలంచుచున్నాము కాని ఆత్మకు నాశములేదు. స్థిరమైన మనస్సు కలవారు ఆత్మనిత్యమని తలంచి కర్మాయుత్తమైన దేహము చెడినప్పుడు అవివేకులవలె శోకింపరు. ఈ సందర్భముననే "ప్రేతబంధుయమ సంవాదమను ఇతిహాసమును కరుణరస నిర్భరముగచెప్పి శోకాంధకార నిమగ్నులైన తల్లి, మరదండ్రహృదయములలో జ్ఞానజ్యోతిని వెలిగించెను. వారికి తత్త్వవిలోకమును కలిగించెను. తల్లిడిల్లువారి హృదయాలకు వేదాంతసూక్తులతో ఊరటకలిగించెను.

మేఘమునుండి పిడుగు, సుధాసారవర్షము కురియునట్లు, సుధాసారవర్షము కురియునట్లు, హిరణ్యకశిపు ముఖమునుండి వేదాంతమృతము జాలువారినది.

పిమ్మట, హిరణ్యకశిపుడు, తపస్సు చేయుటకు మందరాచలమునకు వెడలి బొటనవ్రేలిమీద నిలబడి ఊర్ధ్వబాహుడై. మిన్నుచూచుచూ వాడిమయూఖంబులలోడి ప్రళయకాలభానునివలె పరమదారుణమైన తపంబుచేసెను. అతని అజరామరభావము, త్రిజగద్రాజ్యము, అప్రతిద్వంద్వత్వము అతని ఘోరతపోవ్రతమునకు పర్వతములతో కూడిన భూమికంపించినది. అంభోనిధులు కలగుండు వడినవి. తారకలు చెదరినవి, దేవతల గుండెలు దద్దరిల్లినవి. దేవతలు, బ్రహ్మను ప్రార్థించిరి. హిరణ్యకశిపుని తపస్సు నివారించుమార్గమును వేడుకొనిరి. బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. హిరణ్యకశిపుడు తన కోర్కెను ఇట్లు చెప్పెను.

శా. గాలింగుంభిని నగ్నినంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములందమః ప్రబలభూరి గ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్య నరాది జంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే తె. భా. 7-90

ఇంతేకాక, రణంబులందు తనకెదురులేని శౌర్యంబును, లోకపాలుర సతిక్రమించు మహిమయును భువనత్రయము జయించునుకోరెనుబ్రహ్మ. హిరణ్యకశిపుడు కోరిన వరములన్నియు అనుగ్రహించెను. ఎట్టిన చిత్రించిన హిరణ్యకశిపుడు అమాయకుడుగా గోచరించును. బ్రహ్మవేసి నవలలో చిక్కుకొనెను. అతడు అమరపతిత్వమునకు తపస్సుచేసెను కాని దానిని వరముగా పొందలేక పోయెను.

ఉ. నామన మొక్కడేల దితినందన సర్వమునా వహించితే
జోమహిమన్ వెలుంగు హరిచోద్యపుభూత మతిండు లీనమై
వేమఱు నిన్ను నన్ను బెఱనిత్య చరాచర భూతజాతమున్
భ్రామకుడై నిజోచితలిఖావిత చేష్టలఁగూర్చునెప్పుడున్. నృ. 4-21

క. ప్రకృతి పురుషాత్మకంబును సకల చరాచర విశేషసర్గము నెవ్వా
నికికార్యం బ విష్ణుని వికార విరహితు సమస్తవిభు బ్రణుతింపున్.
నృ॥ -431

అతని ప్రశ్నకు, ప్రహ్లాదుడు నాకుకాదు, లోకములకు, నీకు విష్ణువేప్రభువు. పరమేశ్వరుడు, ధాత. ఈవిద్య, ఒకరు బోధింపనక్కరలేదు. ప్రకృతి పురుషాత్మక మైన, సకలచరాచరసృష్టి ఆవిష్ణుని కార్యము అనిచెప్పెను. ఈమాటలు విన్నంతనే, హిరణ్యకశిపుని, మతిపోయినది. తన అభిమతమునకు వ్యతిరేకత ఇసుమంత కలిగినను ఎంతమాత్రము సహింపక, వేగముగా నిర్ణయము తీసికొను స్వభావము కలవాడుగా హిరణ్యకశిపుడు గోచరించును.

క. "అనినఁగడు గడిఁది యైమది గనలునిగుడ బుత్రభావకలిత స్నేహం
బునుగృపయుఁ బాయ సురరిపుడనుచరులం జూచి యట్టులనురభసమునన్"

క. కులమునకు గొప్పగుద్దలి ఖలుడు కులాంగారకంబు కష్టుడు వీనిం
బొలియింపుడు ఘనశస్త్రంబుల వెసనొకగుడ్డు మురిగిపోనేమియగున్

ఆ. కొడుకు తండ్రిమాటఁగొనక యూరసమున
నడచునేని వాఁడు కిడిది దాయ
గానపగతుఁ జంపగాఁ దగుఁ బగవాని
పక్షమైనవారు పగతెకారె నృ-చ-24-25-26

హిరణ్యకశిపుడు, భీషణభుజంగములచే, కరపించియు, ఏనుగులచే, త్రొక్కించియు, అగ్నిజ్వాలలో త్రోయించియు భక్ష్యభోజ్యాదులయందు విషప్రయోగము చేసియు, ప్రహ్లాదుని అనేక హింసలుపెట్టి మాటి మాటికి పిలిపించియు, హరిభక్తిని ఉజ్జగింపుమని విఫలప్రయత్నము చేసెను. అతని ప్రయత్నములన్నియు అగ్నికి దూది పింజలవలె కాలిపోయినవి. ప్రహ్లాదుని, హరిభక్తి మాత్రము చెక్కుచెదరంలేదు.

పోతన :- ఎట్టిన, హిరణ్యకశిపునకు పోతన, హిరణ్యకశిపునకు ఎంతయో భేదమున్నది. పోతన, హిరణ్యకశిపునిలో ఆర్ద్రత, ఆత్మీయత, పుత్రప్రేమ, కృప మొదలైనవన్నియు తొణికసలాడునట్లు ప్రతిసంభాషణము మలచబడినది. దశరథుడు,

శా. ఏదిక్కాలుర చూచినేడలుగునో, యేదేవు బంధించునో
యేదిగ్భాగము మీద దాడిచనునో యేప్రాణులం జంపునో
యాదైత్యేశ్వరు(డంచు నొండొరులు దారింద్రాదులాస్థాన భూ
వేదిన్ మెల్లన నిక్కిచూతురు భయావిర్భూత రోమాంచులై. తె॰ భా. 7 100

ఎఱ్ఱన, వర్ణనమహనీయముగ హాస్యరసాభాసముగ హిరణ్యకశిపుని దుండగము లను వర్ణింపగా, పోతన కథాగమనము కుంటుపడకుండ సంక్షిప్తముగా వర్ణించెను. హిరణ్యకశిపుని దారుణపాలనముచే బాధపడి, బృహస్పతి ఉపదేశానుసారము దేవతలు విష్ణుమూర్తిని సందర్శించి తమదుస్థితిని కన్నీరు మున్నీరుగా నివేదించుకొనిరి. నారాయణుడుతాను నరసింహావతారము ధరించి, హిరణ్యకశిపుని, సంహరింపగలనని, అభయమొసగెను.

పోతన :- దేవతలందరు కలసి, రహస్యసమాలోచనముచేసి, హృషీకేశుని సంలగ్నచేతస్కులై ప్రార్థించిరి. విష్ణుమూర్తి ప్రత్యక్షమైనాడు. హిరణ్యకశిపుడు శమదమసంపన్నుడు నిర్వైరుడైన ప్రహ్లాదుని, ఏనాడు బాధపెట్టునో, ఆనాడు హిరణ్య కశిపుని వధింపగలనని చెప్పెను.

విష్ణుదేవుని అభయవాక్యములందు నృసింహావతార ప్రస్తావనచేయగా, పోతన ప్రహ్లాదుని ప్రస్తావించెను. ఎఱ్ఱన- హిరణ్యకశిపుడు తనరాజ్యమునకు వచ్చిన పిమ్మట ప్రహ్లాదుడు పుట్టినట్లు కల్పించెను. ప్రహ్లాదునకు సోదరులున్నట్లు కన్పింపదు. పోతన భాగవతముప్రకారము, హిరణ్యకశిపునకు నలుగురు పుత్రులున్నట్లు గోచరించు చున్నది. హిరణ్యకశిపుడు ఆజన్మాంతము, సురద్వేషము, విష్ణుద్వేషము ధర్మద్వేషము కలవాడు. ప్రహ్లాదుడు, శైశవదశలో, నుండగా ప్రియపుత్రుని ఉపలాలించెను బిడ్డ పెరిగి పెద్దవాడైన పిమ్మట, అతనిభావము, తనకు నచ్చక ప్రేమింపలేకపోయెను. యుక్తవయస్కురాగానే, ప్రహ్లాదునకుచౌల, మౌంజీ, బంధసంస్కారాదులు, యథోచిత ముగాచేయించెను. విద్యాపరిగ్రహణమునకు, గురు గృహమునకు పంపెను. పుత్రుని విద్యాభ్యాసము ఎటులనున్నదో, తెలియకోరి, పుత్రుని పిలువ పంపెను.

**పాపడ ! ఇంతకాలము నీవు ఉపాధ్యాయులబద్ద నేర్చుకొనిన, విద్యలోని దివ్య సుభాషితరత్నము వీనులవిందుగ సంభాషింపుమన ప్రహ్లాదుడు, విష్ణువును పొగడుటకు ప్రారంభించెను. హిరణ్యకశిపునకు ఒడలుమండి పోయినది, గురువులనుండియా ? పరులనుండియా ? ఈదుర్బోధ నీకుఎట్లు కలిగినదని గద్దించెను.**

ఇట్టి చెడుసంగతులు నీమనస్సులో స్వయముగా తోచెనా? మఱి ఎవ్వరైనా చెప్పినారా? లేనియెడల మనకులవిరోధి యగు విష్ణువును, ఏలపొగడుచున్నావు? పుత్రకా మనము హరిందలచుట పాడికాదు. మనరాక్షసులు, సురలందోలుటయు, సురాధిపతులను, జయించుటయు సహజము. ఈ హరిభక్తి నీకు మంచిదికాదు. ఆ మాటలకు ప్రహ్లాదుడు అనుత్తమమైన మధురోదాత్తమైన ప్రబోధముచేసినాడు.

అంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృతపాన విశేషమత్త చిత్తమేరీతి ఇతరంబు చేరనేర్చును. అనిగట్టిగ చెప్పెను. మఱియొకసారి ప్రహ్లాదుని పిలిపించ గాపాదప్రణామముచేసి, నిలుచును. కొడుకును దీవించి బాహుదండంబుచాచి, డగ్గర దగ్గఱందిగిచి గాఢాలింగనముచేసి, తన తొడలమీద నిడుకొని చుంచుదువ్వి చిబు కంబుపుడికి, చెక్కిలిముద్దుగొని, శిరంబుమూర్కొని, ప్రేమాతిరేక, సంజనిత బాష్ప సలిల బిందుసందోహంబుల ఆతని వదనారవిందంబు దడుపుచు మంద మధురాల పంబుల నిట్లనియె.

నాయనా! నీవు బుద్ధిమంతుడవై శుక్రపుత్రులు చెప్పిన విషయములన్నియు చదివితివనియు బుద్ధిమంతుడవైతివనియు, నీగురువుగారు చెప్పగా, నాకుఎంతోసంతోష మైనది. నీవుచదివిన శాస్త్రములలో, సారభూతమైన, ఒకపద్యమువదివి తాత్పర్యము చెప్పు. నాయనా నీతోడి దైత్యబాలురు నీతిశాస్త్రములు చక్కగాచదివి, ఒకరికి చెప్పనేర్చినవారై, నీకుఏదియు తెలియదని నిన్ను లక్ష్యపెట్టకున్నారు. నీవువారివలె, నీతివిదుడవంచుచును, మహావాంఛతోనున్నాడను, ననుగన్నతండ్రీ భవదీయోత్కర్షముం చూపవే? ఈమాటలన్నియు హిరణ్యకశివుని పుత్రప్రేమను తెలుపుటలేదా? అతడు హృదయములేని కటికి రక్కసుడుకాడు. పుత్రునియొక్క అభ్యుదయము కొఱకు అహరహము కంటికి రెప్పవలె చూచుకొన్న సంస్కారశోభితుడైన ఉత్తమ జనకుడు.

ఎఱ్ఱన :- ఎఱ్ఱన, హిరణ్యకశిపుడు తన మొండిపట్టు నెరవేరుటకు బుద్ధికి తోచిన పథకములన్నిటిని ప్రహ్లాదునిపై ప్రయోగించినాడు. అవిఅన్నియు వ్యర్థమైనవి, ప్రహ్లాదుని సిగపూపు వాడలేదు. ప్రభువుగానేరముచేసిన వానిని శిక్షాస్మృతి ననుసరించి దండనములన్నియు విధించినాడు. తండ్రిగా అతడు పొందిన మానసిక వేదనము వర్ణింపలేదు.

పోతన - హిరణ్యకశిపుడు తనపుత్రుని రాక్షసేంద్రపదవికి అర్హునిగాచేసి దేవతలపై కొడుకుచే కసితీర్చుకొనుటకు కొండంత ఆశపడెను. ప్రహ్లాదుడు, తాను

హిరణ్యకశిపుడు, పుత్రప్రేమచే మరణించిరి. హిరణ్యకశిపుని, విష్ణుద్వేషమునకు పుత్ర ప్రేమకు కలిగిన సంఘర్షణము వర్ణనాతీతము. తత్ఫలముగా, ఆతని మనసులో, క్రమముగావచ్చిన, పరిణామమునకు అతనిపై సానుభూతి కలిగించును. ప్రహ్లాదుడు, విష్ణుభక్తి కలిగియున్నాడని పసిగట్టినంతనే తండ్రియగు హిరణ్యకశిపుని హృదయమున పుత్రుని అభివృద్ధి కొఱకు అతడు పొందిన విచికిత్స.

ఈప్రహ్లాదుడు, రాజ్యమును, తన్నును లక్ష్యముచేయక తెలివిమాలినవాడై యున్నాడు. చదువనివాడు, అజ్ఞుడగును. చదివిన యెడల సదసద్వివేక చతురత కలుగును. జనులకు ఆర్యులొద్ద చదువుట కర్తవ్యము. నాకన్నతండ్రి- ఆర్యులొద్ద చదువుము. శుక్రాచార్యులకొడుకుల, చండా మర్కులను, రావించి ఇట్లనెను మాపిల్ల వాడు గ్రుడ్డివానివలె ప్రపంచజ్ఞానములేక యున్నాడు. అస్మత్ప్రతాప క్రియాగంధము ఇంచుకయులేదు. మీరు గురువులు, కారుణ్యచిత్తులు, మనోబంధులు, మాన్యులు, మాకుపెద్దలు, అందుచే దయతో ఈబాలుని చదివించి, నీతికుశలున్కావించి రక్షింపరే" పుత్రాభ్యుదయము కొఱకు ఆతండ్రి ఎంత ప్రత్యేకశ్రద్ధ, కనబరచుచున్నాడో గమనార్హము. కొంతకాలమైన పిమ్మట, ప్రహ్లాదుని గురుగృహమునుండి పిలిపించి, మిక్కిలి ప్రేమతో దగ్గఱకు పిలిచి, తొడమీద కూర్చుండపెట్టుకొని నీవువేదములను, శాస్త్రములను, చదువుకొంటివా ? మునుపటివలెకాక ఇప్పుడు మంచి జ్ఞానము కలిగెనా ?

క. అనుదిన సంతోషణములు జనితశ్రమ తాప, దుఃఖసంశోషణముల్
తనయుల సంభాషణములు జనకులకుంగర్ణ యుగళసద్భూషణముల్
తె. భా. 7-240

ఈమాటలు, త్రైకాలిక సత్యములు. అవి అతనినోట, వెలువడుట ఆతని ఆర్ద్ర స్వభావమును తెలుపుచున్నది. పిమ్మట, తనపుత్రుడు, స్వభావముచే మంచివాడనియు బాలురు ఏదిమాటాడిన, అదియే అనుకరింతురు. ఏగూటి చిలుక ఆగూటి మాటయే పలుకునుగదా ! నాకుమారుడు అశుభము, శుభము తెలియని, పసివాడు. నాకు విరోధముగా పలుకుచున్నాడు ఈమాటలు ఇతడు ఊహించి చెప్పదగినఈడు కలవాడు కాడు. ఎవరోనాకు కిట్టనివారు వీనికి ఇట్టి దుర్బోధ నూరిపోసియుందురు అనితలచెను. ఇది లోకములోని, ప్రతితండ్రి తనబిడ్డ చాలమంచివాడనియు ఇతరులే తనబిడ్డ చెడిపోవుటకు ప్రబలకారణమని తప్పు ఇతరులపై నెట్టివేయుచుందురు. ఇది ఆనాడే కాదు ఈనాడును చూచుచున్నాము. తరువాత, నాయనా నీవు మాబిడ్డవై మాకు అనుకూలముగా పలుకవలసియుండగా ఇంతవిరోధముగా పలుకుట, కడుచోద్యముగా నున్నది.

ఎఱ్ఱన మనస్తత్వము కథాకథనాత్మకమైనది. పోతన స్త్రీసహజమైన కోమలమైన భావకవితామార్గములో తనహృదయమునకు సంవదించిన సందర్భములలో ఆపాత్రలలో లీనమై నాటకీయముగ చిత్రించెను. పాత్రలను, మనకన్నుల ఎదుట సాక్షాత్కరింప చేయును,

ఎఱ్ఱన - ప్రహ్లాదుడు పుట్టుకచే విష్ణుపదకమల ధ్యాన వివశుడు. విజ్ఞాని, శైశవమందే నారాయణ భూతభావి, భవ్యావతార బోధమహిమను, చక్కగ నెఱింగిన వాఁడు. యోగీశ్వరుడైన భక్తుడు. హిరణ్యకశిపుడు బ్రహ్మవలన వరములుపొంది పట్టాభిషిక్తుడైన పిమ్మట, ప్రహ్లాదుడు జన్మించెను. ఇతనికి సోదరులున్నట్లు ఎఱ్ఱన పేర్కొనలేదు. గుర్వాజ్ఞప్రకారము నిఖిలలోక ప్రహ్లాదముఁ (మిక్కిలి ఆనందము) కలిగించుటచే బాలునకు ప్రహ్లాదుడను పేరుపెట్టెను. అతడు అమ్మకడుపునుండి చల్లగా పుట్టిననాటి నుండియే విష్ణుపదకమల ధ్యానవివశుడయ్యెను. పసిపాపడై పవళించుకాలమున వటపత్రశయను భావంబునదలచియు, శయ్యపై బోరగిలపడునప్పుడు కూర్మమూర్తిని తడవెడు విధమున, కూర్మమూర్తిని తలచియు, బుడి, బుడినడక నడచునపుడు వామనమూర్తి బుజ్జిబుజ్జి అడుగులు అనుకరించియు, వెన్నపాలు గ్రోలెడునప్పుడు గోపాలుని తలంచియు పరమపురుషుని అవతారమహిమను తగనెరిగి అఁటుజోదర, ధ్యానతత్పరుడయ్యెను. అతడు ముద్దులు మూటగట్టు తొక్కుపలుకులచే, అచ్యుతునిపేరు మాటిమాటికి పలుకుచు తోడిబాలురతో ఆటలాడునపుడు శ్రీమహావిష్ణు గుణగానము చేయుచు, అందఱికి ముద్దుగొలిపెను.

ఆ. కుడిచినపుడు నిద్రగూరిన యప్పుడు మేలుకొనిన యపుడు మెలగినపుడు
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయకాని పలుకఁడొండు బుద్ధి దలపడొండు
నృసిం - 3 - 150

తొలుత "మూడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేదను" నానుడి ప్రహ్లాదునిపట్ల అన్వర్థమైనది. ఈవిధముగా ఎఱ్ఱనగారు ప్రహ్లాదుని సౌశీల్యమును, ఆఖ్యానపద్ధతిలో వివరించిరి.

పోతన :- భాగవతముయొక్క పరమధ్యేయము భవద్గుణానుభవము. భాగవతకీర్తన.

"ప్రహ్లాద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠవిభీషణాది పుణ్యానిమాని, పరమభాగవతాన్ స్మరామి"

పరమ భాగవతోత్తముడు ప్రహ్లాదుడు. అతడు భగవత్స్మరణ మాత్రము

చెడిపోవుటయేకాక శత్రువుంతో చేతులుకలుపుట, పైపెచ్చు రాక్షసబాలురను తనవైపు త్రిప్పుకొనుట యిదిరాజద్రోహము దేశద్రోహము అందుచే హిరణ్యకశిపుడు తన హృదయములోని పితాపుత్ర సంబంధము కోసివేయుటకు ఎంతబాధపడెనో ఆతని మాటలు తెలుపుచున్నవి.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీయజ్ఞాంగుల ద్రోహి దు
స్సంగుంగేశవ పక్షపాతినధముంజంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతి జరించెదంగులముని ర్దోషంబు గావించెదన్ తె॥ భా॥ 7-180

హిరణ్యకశిపుడు అనేక మారణోపాయములచే ప్రహ్లాదుని రూపుమాపలేక పోవుటచే ఏకాంతంబున దురంత చింతాక్రాంతుడై ఇట్లుపగచెను. ''ఈప్రహ్లాదుని సముద్రములోముంచితిని. గదలతో కొట్టించితిని. ఇన్నివిధముల కష్టపెట్టినను వీడు చావకయున్నాడు. ఇది కడువింతగనున్నది. వీనిప్రభావము దివ్యమైనది అని తల పోసెను. శునశ్శేఫుడను మునికుమారుడు, తండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుండయి తండ్రి తనకు అపకారియని తలంపక, బ్రతికిన చందము ఆతని భావాంబరమున మెఱసెను.'' వీడు మహాప్రభావసంపన్నుడు అనుకొందును. వీనితోడి విరోధంబు నందనకు మృత్యువు సిద్ధించునని, నిర్ణయించి చిన్నబోయి ఖిన్నుండై ప్రసన్నుడు గాక, క్రిందుసూచుచు విషణ్ణుండై చింతించుచుండెను.

ఈవిధముగ, హిరణ్యకశిపుడు ప్రియపుత్రుని, హింసించునపుడు, పొందిన అంతరంగమథనము, ఆతడు పొందిన ప్రతిక్షణ మానసిక పరిణామము చిత్రించుట మహాకవి పోతనకే చెల్లినది.

పెద్దన చిత్రించిన, హిరణ్యకశిపుడు, అనాగరికుడు మోటుమానిసి. పోతన చిత్రించిన హిరణ్యకశిపుడు సంక్లిష్టపాత్ర. ఒక్కమాటలో హిరణ్యకశిపుని హృదయ స్తంభము పగిలి అందుండియే నృసింహమూర్తి ఆవిర్భవించును. ఇది పోతనగారి భావన.

## ప్రహ్లాదుడు

పెద్దన విష్ణుపురాణాదిగ్రంథములను, పోతన సంస్కృత భాగవతమును మూలముగా గ్రహించుటచే ప్రహ్లాదపాత్ర చిత్రణములోకూడ చాలభేదము కనిపించును.

డుడు, రాక్షసబాలురను నిమిత్తముగా చేసికొని చేసిన ప్రబోధము సర్వమానవాళికి శ్రేయస్సు, ప్రేయస్సు కలిగించునని ధ్వని. సాధన చతుష్టయములో జగత్తు అశాశ్వత మని, పరబ్రహ్మము నిత్యమని గుర్తించుట ప్రధాన సోపానము. తత్త్వజ్ఞానము కలుగుట ఆత్మహితము. మానవత్వము దుర్లభము. అంతకంటె దుర్లభమైనది ముముక్షుత్వము. పుట్టినప్రతిజీవియు షడ్వికారములు పొందును. అనగా పుట్టుట, పెరుగుట, వయస్సులో చెన్నొందుట పిదప చచ్చుట సహజము. పునరపిజననము పునరపి మరణము దాని లక్షణము. జన్మకుకారణము. పూర్వజన్మ ఫలము. లోకములో, ఏవస్తువు శాశ్వతసుఖమును, శాశ్వత దుఃఖమును ఈయవు. కస్తూరి చందనము మొదలైన సుఖోచిత సారవస్తువులు కఫ, వాత, పైత్య, కలితంబగు దేహముతోకూడి దుష్టత్వము పొందుటలేదా ? అందుచే ఈమురికికొంపను నమ్ముటపాడియే. ఆలుబిడ్డలు, ఇండ్లు, అర్థంబులు చెలులు కూడపెట్టిన డబ్బుచెడినపుడు మానవుడు పొందువేదన అంత ఇంత కాదు. మానవుడు శైశవమునుండియే ధర్మాచరణమునకు వాయిదావేయక, భక్తి తత్త్వము జ్ఞానము పెంచుకొనవలెను. ఈ తత్త్వజ్ఞానము ఒక్కదినములో వచ్చునది కాదు. అది బహుజన్మలతపః ఫలము. కావున శైశవమునందే దుస్తరమైన మోహపాశమును కోసి విష్ణుమయ పుణ్యసమాహిత తత్త్వచింత మనసులో పదిలపఱచుకొని, అనన్యగతికులై భక్తియుక్తులు కావలెను. పరమేశ్వర సాయుజ్యము పొందినప్పుడు భక్తిమార్గముకంటె సులభోపాయములేదు. మోక్షసాధన సామగ్రిలో భక్తిసర్వజన సులభము. పూలుపఱచిన మార్గము.

క. చెడి పోకుడు సంసారము గడతేర్పుడు శౌరిచరణకమలము లెడ్డం
దిడికొనుడూరక కాలము కడపకుడి వివేకవీథి గడగుడు నడవన్

సీ. బాలుడ నేని ప్రౌఢబాలోచిత క్రీడ
లనుభవించెద మఱి యౌవనమున
నెఱవాడనై ధర్మమెఱిగి చేసెదగాక
యనిపోవు నటపోయి యౌవనమున
సుఖములచవి, జొక్కు జొక్కి యున్నదిగదా
ముదిమిధర్మమునెల్ల నాదువ జేయ
నని చనుఁజని వృద్ధుడై యౌవనమునంద
జెన్నొంద ధర్మంబు చేయనైతి

చేతనే పరవశుడయ్యెడి మహనీయుడు. పోతన మహాకవి భక్తికి జీవత్‌దృష్టాంతముగా, ప్రహ్లాదుని చిత్రించెను. లలిత మర్యాదుడైన ప్రహ్లాదుని సాత్వికమూర్తిని మనకన్నుల ఎదుట ప్రత్యక్షమగునట్లు కథాప్రారంభముననే, తన్మయభావముతో చిత్రించెను.

సీ॥ ఆడుగడ్డునకు మాధవాను చింతన సుధా
నూదుర్వ్రమన మేనుమఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపగలేని
హరిభక్తిపుం భావమైనవాని
మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగా
జిత్తమచ్యుతుని మీద జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీ విష్ణుమయ మని, తెలగువాని

వినయకారుణ్యబుద్ధి వివేకలక్షణాదిగుణముల కొటపట్టయినవాని
శిష్యుబుధలోక సంభావ్యుజితగురుడుముండడెకి ద్రొబ్బితండ్రికి మొక్కమనుచు
తె। భా। 7-160

ప్రహ్లాదుడు సర్వప్రాణులను, తనవలె చూచువాడు. పెద్దలపొడగన్నచో, భృత్యునికైవడి చేరి ప్రణామము చేయువాడు కన్నుదోయికి అన్యకాంతలడ్డంబైన మాతృభావముచేసి తొలగువాడు, తల్లిదండ్రులభంగి, ధర్మవత్సలతతో దీనులను రక్షించువాడు. సఖులయెడ సోదరస్థితి మెలగువాడు. గురువులను దైవసమానముగా తలచువాడు. ఎగతాళికైనను అసత్యములు పలుకనివాడు. ఇదియే ప్రహ్లాదుని లలిత మర్యాదకు దర్పణము. అతడు హరిభక్తియందు ప్రధాన దృక్పథము కలిగి ప్రపంచములోని వస్తువులన్నియు అశాశ్వతములని నిశ్చయించినవాడు. లోకములో సామాన్యులకు గర్వముపుట్టించు సౌందర్యము కలిగియు, అభిజాత్యసంపద కలిగియు, విద్యా విశారదుడయినను గర్వపడనివాడు, ఎన్నిభోగములున్నను వానియందు లౌల్యము పొందక, కామక్రోధాదులను దూరముగ నుంచిననాడు ఈవిధముగా, పోతనార్యుడు భక్తిసౌరభ సంవాసితము సాభిప్రాయ గర్భితమగు మందారమాలను ప్రహ్లాదుని కంఠమున అలంకరించెను.

ఎఱ్ఱన :- ప్రహ్లాదునిచే తత్త్వజ్ఞానసహితమైన విష్ణుభక్తియే సారూప్య సాలోక్య సామీప్య సాయుజ్యరూపమైన విష్ణుసమీపకంతము చేర్చునని, ప్రవచింపచేసెను. ప్రహ్లా

పోతన :- ప్రహ్లాదునిచే ఇంచుమించు ఎఱ్ఱనార్యుడు చేయించిన విధముగ ప్రబోధము చేయించెను. ఎఱ్ఱన చిత్రించిన ప్రహ్లాదుడు యోగీశ్వరుడైన భక్తుడు. సకల ఉపనిషత్ ప్రతిపాదితమైన ఆత్మతత్త్వమును తటస్థముగానుండి ప్రవచించిన ధీరుడు.

పోతన కారణజన్ముడైన కవి. భక్తికొఱకే ఇతడు పుట్టెను. భక్తిని ప్రపంచింపటకొఱకే పోతన, ప్రహ్లాదునిచరిత్ర బహుగుణ రమణీయముగ గానముచేసెను. పరాశ్రయ కవిత్వమునకు, ఆత్మాశ్రయ కవిత్వమునకుగల భేదము ఎఱ్ఱన పోతనల ప్రహ్లాదచిత్రణములో కన్పించును. పోతనార్యుడు తనకు, హరిభక్తి యెడల కల అభిప్రాయములు అన్నియు ప్రహ్లాదునిచే పలికించెను ఆపలుకులు, ఆకుసుమకోమల హృదయమునుండి వెలువడిన కలకండలు. భక్తిమహిమాతిశయము ఇంతఅందముగా ప్రవచించిన మఱొకకవి ప్రపంచసాహిత్యమున లేడు పోతన ప్రహ్లాదుడు లలితమర్యాదుడై ఆంధ్రులమనోపీఠమున ఆచంద్రార్కము అలంకరించియుండుట విశేషము. ప్రహ్లాదుని కల్యాణగుణములు బృహస్పతి, భాషాపతి, ఫణిపతి వరింపలేకపోయిరనుట చతురము.

గుణనిధియగు, ప్రహ్లాదుని గుణమునేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్

తె॥ భా॥ 7-120

## బ్రహ్మ

ఎఱ్ఱన, చిత్రించిన బ్రహ్మ గడుసువాడుగా కనిపించును. బ్రహ్మ చతురముగ మాట్లాడి హిరణ్యకశిపుని బుట్టలోవేసికొని అతడు అమరపతిత్వము కొఱకు తపస్సు చేసిన సంగతి మరచిపోవునట్లు చేసినాడు.

సమధికి పూర్వదేవకుల సంజనితుండవు నీవు నీకు న
య్యమరపదంబు దక్కువ సురాధిపతిత్వము నీకదెంతయు
య్యమరవరేణ్య సంపదకు నగ్గలమై పెనుపొందు వైభవం
బమరుట యేమిటంగలుగునట్టి వరంబు దలంపు మింపుగన్ నృ-ద్వి-96

పోతన :- భాగవతమున చిత్రించిన బ్రహ్మ అమాయకుడు. సంభాషణాచతురుడు తండ్రివలె, హిరణ్యకశిపునకు హితోపదేశము చేసినాడు. బ్రహ్మవరములు ఇచ్చుచు ఇట్లనెను. నాయనా ! కశ్యపపుత్రా ! నీవుకోరిన వరములు అన్యజన దుర్లభములైనవి. అయినను నీమీద ఉండెడి ప్రేమతో, అనుమోదించితిని. నీవు, ఈవరములు

నేమిసేయుదు గాలు చేయించుకయునుపసముగాదు చిత్తంబుతా మసముగప్పె
ననుచునట, తానుబాలియునట్లాత్మహితము సేయనబ్బదెప్పుడు మూఢచేసునకు
నృ చ - 74 - 75

భక్తిని చిత్రించిన భాగవతఘట్టము లన్నింటిలో ప్రహ్లాదచరిత్ర శిఖరాయమాణమైనది. భక్తులు వివిధ దశలలో కాంచెడి దివ్యానుభవములు నారద భక్తిసూత్రములలో పదునాకొండు రీతులుగ విభజింపబడినది. భగవంతుని కల్యాణగుణములను వర్ణించి, ఆయన మహిమలను నిరంతరము పరవశచిత్తముతో, గానముచేయుచు, సంకీర్తనము కావించుట ఒకవిధమగుభక్తి. భగవంతుడు తనతో మాట్లాడినట్లు తనకు దర్శనమిచ్చినట్లు, తల్లిలలనుచూచినట్లు భక్తులు అనుభూతులను పొందుచుందురు. ప్రహ్లాదుని సంస్కారము ఈజన్మలోనిదికాదు. అది పూర్వజన్మ పరమభాగవత సంసర్గ సమాగతంబైన ముకుందచరణారవింద సేవాతిరేకమని పోతన మధుర భావన.

పోతన చిత్రించిన ప్రహ్లాదమూర్తి మనమెన్నడును మరువజాలము. సర్వభక్తులలో ప్రహ్లాదుడు సర్వశ్రేష్ఠుడు. గజేంద్రునితో పోల్చిచూచిన యెడల ప్రహ్లాదుని భక్తి విశేషము గోచరించును. గజేంద్రుడు పురుషకారము వ్యర్థమైన పిమ్మట, ఆర్తుడై భగవంతుని ప్రార్థించెను. ప్రహ్లాదుడు ఆర్తుడుకాడు, పురుషకార రహితుడు. నిత్యప్రసన్నుడు. ప్రహ్లాదుని విష్ణుభక్తి ధృఢమైనది. దానికి ఎట్టి సందేహములునులేవు. భగవంతుని నిత్యప్రసన్నభావమును చూరగొన్న మహాత్ముడు. ప్రహ్లాదుడు చదువులలోని మర్మమెల్లను గుర్తించిన స్థితప్రజ్ఞుడు. ఈచరాచర ప్రపంచమంతయు విష్ణుమయమని గుర్తించుటయే బుద్ధిమంతుల కర్తవ్యము. జగతి పుట్టి పుట్టి, చచ్చి చచ్చి, పొరలనేల? మనకు పుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి విష్ణుదేవుని ఆశ్రయించుటయే ప్రథమ కర్తవ్యము. పోతనమహాకవి ప్రహ్లాదుని శీలమును చిత్రించుటలో ఆతని ఆత్మీయతను ప్రకటించెను. ఒక్కమాటలో చెప్పవలెనన్నచో ప్రహ్లాదునిలో పోతన తొంగిచూచును. ఆ పాత్రను వర్ణించుటకు సాభిప్రాయ గర్భితమైన విశేషగుణగానము చేయుట ప్రశంసింపదగియున్నది.

బుధజనవిధేయుడు సుగుణమణి, గుణగరిష్ఠుడు, కర్మబంధలవిముక్తుడు, పవిత్రుడు.

అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పాన
విశేషమత్తచిత్తుడు, హరిభక్తి పుంభావమైనవాడు
తనలోని అఖిల ప్రపంచంబు శ్రీ మహా
విష్ణు మయమని చెలగు వాడు

సంభాషణాచారిమతో, మన స్తతత్వ చిత్రణముతో తెలుగుతనము జాలి అందు గోచరించుచున్నవి. పోతన తనపుత్రునకు ప్రచండ వితర్కులైన శుక్రాచార్యుని కొడుకులగు చండా మార్కులను నియోగించెనని మొదటనే తెలిపియున్నాడు.

ఉ. తప్పులులేవు మావలన దానవ నాథవిరోధిశాస్త్రముల్
సెప్పము కూర్చిరులై పరులుజెప్పరు మీచరణంబులాన సు
మ్మెప్పుడు మీకుమారునకు నింతయు నైజమనీషయెవ్వరుం
జెప్పెడిపాటి గాదు ప్రతి చింతదలంపుము నేర్పుకై వడిన్
మిత్రులము పురోహితులము పాత్రులమేమదియుగాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెజేయగ శత్రులమే ? దైత్యజలధి చంద్రమ ! వింటే
తె. భా. 7 175-176

తండ్రిముందటనే గురువులు ప్రహ్లాదుని మందలించి, అంకించిన విధము తెలుగు దేశములోని వీధిబడిలోని సన్నివేశమును గుర్తునకు తెచ్చుచున్నది. ప్రహ్లాదునివైరి విభూషణ వంశదూషణాచూడగా నీకు, పట్టుమని ఐదేండ్లులేవు. బాలుడవు ఇంచుక నెట్టికసీలయంతలేవు. నీవయస్సునకు మించిన తర్కవాక్యములు కూయుచున్నావు. మేము ఇన్నాళ్ళుకష్టపడి చెప్పిన చదువంతయు బూడిదలో పోసిన పన్నీరువలెచేసి, రాజునెదుట మేము తలవంచుకొనునట్లు చేసితివి. ఎంతవాడవురా ? వీడు దానవపతికి తనయుడుకాడు పుత్రరూపములోనున్న శత్రువు. ఇతడు దైత్యచందన వనములో ముండ్లచెట్టువలెపుట్టినాడు. అంతటఉపాధ్యాయుడు, కోపాక్రాంతతాంతచిత్తుడైన హిరణ్యకశిపుని అనునయించినట్లు పలికినాడు.

"ఈపాపని చదివింతుము మీపాదములాన. ఇంక నిపుణతతోడ చదువుచెప్పగలము కోపింపకుము."

ఉపాఖ్యానములో ప్రధానకథతోపాటు ఉపపాత్రలను కూడ ఇంత స్వభావ సుందరముగ చిత్రించుట మహాకవులకు మాత్రమే సాధ్యమగును.

చ. తనయుడుగాడు శాత్రవుడు దానవభర్తకు వీడుదైత్య చం
దన వనమందు గంటకయుతక్షితి జాతము భంగిబుట్టినా
డనవరతంబు రాక్షసకులాంతకు బ్రస్తుతిసేయుచుండు దం
డనమునగాని శిక్షలకుడాయడు పట్టుడు కొట్టుడుద్ధతిన్ తె. భా. 7-153

నిపుణత్వముతో, సుమతివై, భద్రైకశీలుండవై బుద్ధిసంపన్నుడవై మెలగుము. ఇందుపుత్రవాత్సల్యము హిరణ్యకశిపుడు భవిష్యత్కాలములో ఎట్లు మెలగవలెనో సూచించినాడు.

శా. అన్నాకశ్యపపుత్ర దుర్లభము లీయర్థంబు లెవ్వారికిన్
మున్నేవ్వాశలు గోరరీ వరములన్ మోదించితిన్ నీయెడన్
నన్నుం గోరినవెల్ల నిచ్చితి బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై తె. భా. 7_92

హిరణ్యకశిపుని వధానంతరము నరసింహమూర్తి యుక్తాయుక్త వివేకజ్ఞానము లేకుండ రాక్షసులకు ఇట్టి వరములుఇచ్చుట పన్నగములకు అమృతము పోయుటయే అని బ్రహ్మ మందలింపబడెను.

ఎఱ్ఱన చిత్రించిన బ్రహ్మకు పోతన చిత్రించిన బ్రహ్మకు కొంది భేదముకలదు.

# ఉపాధ్యాయులు

ఎఱ్ఱన నృసింహపురాణమున ఎఱ్ఱన చిత్రించిన ఉపాధ్యాయులు సాధారణ ఉపాధ్యాయులవలె, రాజభక్తి విలసితులుగను, గోచరింతురు. రాజాజ్ఞను తిరస్కరించుట, ప్రాణసంకటముగా భావించిరి. ప్రహ్లాదునకు విద్యబోధింపుమని ఉపాధ్యాయులను నియోగించెను. ప్రహ్లాదుడు, హరిభక్తిని ఉపన్యసించెను. అదిచూచి మండిపడి తనకుమారునికి ఈదుర్బోధ చేసినవారెవ్వరని హిరణ్యకశిపుడు గర్జించెను. భార్గవనందనుడు, హిరణ్యకశిపునితో విద్యగఱపుటలో తమతప్పు ఏమియులేదని, ప్రహ్లాదుడు తమమాట వినుటలేదని భయభక్తులతో వణకిపోవుచు విన్నవించిరి.

చ. కివియకు దైత్యనాథయొకకీడును నాదెసలేదు చెప్పనీ
తనయుడు వక్రశీలుడు నితాంతనయోక్తులనేను సెప్పగా
వినక నిజేచ్ఛమై గడగి వేమరువిట్టన యుగ్గడించు నీ
యనువున నిట్టికోరదపుటాలరి శిక్షలకేల చేపడున్ నృ చ-11

పోతన :- ఎఱ్ఱన చిత్రించిన ఉపాధ్యాయులకు ప్రత్యేకత ఉన్నట్లులేదు. ప్రహ్లాదచరిత్రలోని భార్గవనందనుడు చేసిన సంభాషణమును ప్రభుభక్తితో, శిష్యవాత్సల్యముతో క్రూరుడైన అధికారియెడ బలహీనుడైన సేవకుడు ఎంతభయభక్తులతో మెలగునో తొణికిసలాడుచున్నవి. ఆఘట్టము నాటకీయముగా, చమత్కారమైన

మహాకవి ప్రతిష్ఠ కోరినట్లున్నది. కాళిదాసు దృష్టిలో కవిశబ్దము వాల్మీకిపట్లనే అన్వర్థము. ఎఱ్ఱనది అట్టి నిసర్గచాపలము. సంస్కృతాంధ్ర కవీశ్వరులు కీలించిన కావ్యశయ్య రూపొందించుటయే ఎఱ్ఱన ప్రధానధ్యేయము.

ఎఱ్ఱనశైలినిగూర్చి ఆచార్య శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యముగారు చెప్పిన అభిప్రాయము, అరణ్యపర్వశేషము నందును, హరివంశమునందును ఎఱ్ఱనది కావ్యకళ, నన్నయ తిక్కనలు, చూపించిన మార్గముననుసరించెను. అతని, నృసింహపురాణము స్వతంత్రకావ్యము. అందాతడు, స్ఫురదరుణాంశురాగరుచి ప్రవేశపెట్ట దలచెను. ఏదియో ఒక క్రొత్తదైన అరుణోదయమును, కవితాజగత్తున కందింపవలెనన్న ఆతని ఆకాంక్ష నృసింహపురాణోదయమున సార్థకమైనది. ఆ గ్రంథమున ఎఱ్ఱన, అపూర్వ వర్ణనానైపుణ్యముతోకూడిన కావ్యశైలికిని, సంస్కృతాంధ్ర పద విశిష్టమైన చతుర మధురోక్తులతోకూడిన ప్రబంధశయ్యకు ఒక విశిష్టవ్యక్తిత్వము సాధించుటకు యత్నించి కృతకృత్యుడయ్యెను. ఎఱ్ఱన కవితకు సత్త్వగుణము నిసర్గము. ధారాశుద్ధి, ఉక్తి వైచిత్రి, ప్రసన్నకథాకథనము, తన్మయీకరణశక్తి, నాదసౌందర్యము, అలంకారౌచిత్యము, వర్ణనాప్రాగల్భ్యము ఎఱ్ఱనకవితయందు అందముగా నమరినవి. నృసింహపురాణము, వర్ణనాప్రధానమైన ప్రౌఢప్రబంధము. ఇందలి క్షీరసాగర, శ్వేతద్వీప, వైకుంఠవర్ణనలు ప్రౌఢములై తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకములైనవి. కథాగమనములోకంటె వర్ణనలలోను పద్యముల జిలుగులోను, శబ్దమాధుర్యములోను ఎఱ్ఱన ప్రత్యేక శిల్పము ప్రకటించెను. ఇతని కవితకు ఉన్నతసంస్కృతచతురోక్తులు నిసర్గము అనగా ఉద్దిష్టమైన, రసోచితమైన, శబ్దములను ప్రయోగించుట, రససిద్ధి ప్రతిభావంతులైన కవులయొక్క ఉక్తివైచిత్రిని ఆశ్రయించుకొని ఉండును అది స్త్రీలలోని లావణ్యమువంటిది. నృసింహపురాణమున, కథాకథనము నన్నయవలెను, పాత్రల సంభాషణలు తిక్కనవలెను నడపినాడని చెప్పవచ్చును.

ఎఱ్ఱన, నృసింహపురాణమున పరమోదాత్త ప్రబంధోక్తులతో రచించెను. గంభీర వాక్ప్రౌఢి అంతటను సరస్వతివలెను ప్రవహించుచున్నది. ఉన్నత పదగుంభనము ఎఱ్ఱన హృద్యముగనేర్చి కూర్చినాడని ఈక్రింది పద్యముదాహరింపవచ్చును.

ఉ. శ్రీస్తన కుంకుమద్రవ నిషిక్తభుజాంతరభాగ విస్ఫుర
త్కౌస్తుభరత్న నూత్నరుచి గర్వితనాభి సరోజ సౌరభ
ప్రస్తుత మత్తభృంగరవరాగ రసోల్బణ భోగిభోగ త
ల్పాస్తరణుం దలం ... సుకృతాత్ముల పాస్త సమస్తకల్మషుల్ నృ-ద్వి-37

# శైలి - ఛందస్సు - భాష

ఎఱ్ఱన :- ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు కవిత్రయ శైలినిగూర్చి చేసిన వివరణము సముచితము. నన్నయ్య శైలి అఖ్యానశైలి. తిక్కనశైలి నాటకీయ శైలి. ఎఱ్ఱనది వర్ణనాత్మకశైలి. సర్వసాహిత్యములను పరిశీలించినచో, (1) కావ్య సామాన్యసరళి (2) పదగుంభనసరళి గోచరించును. మొదటిది వస్తువిన్యాసమునకు సంబంధించినది. రెండవది శబ్దవిన్యాసమునకు సంబంధించినది. కావ్యసామాన్య సరళియందు, బుద్ధిగమ్యత, భావస్ఫోరకత్వము, వర్ణ్యపేయత్వము ముఖ్యలక్షణము లుగా చెప్పవచ్చును. నన్నయది అక్షరరమ్యమైనది కర్ణపేయమైనశైలి. పద్యము చెవులపడినంతనే అందలి అర్థము అవగతమైనను కాకపోయినను ఆ కాంతకోమల పదావళి మనలను పరితోషమాలికా డోలికలలో విహరింపచేయును. నన్నయ, అర్థ కాఠిన్యము శబ్దపారుష్యము పొంతబోక, రసానుగుణమైన పదప్రయోగము, సమాస ఘటనముచేయును. ఈశబ్దగాంభీర్యము నన్నయ రచనకు ఉదాత్తతయు, ఠీవియు సమకూర్చినది.

తిక్కనది బుద్ధిగమ్యమైన పదగుంభనశైలి. దీనికి అర్థవ్యక్తి, సమ్మితత్వము సంక్షిప్తత, సమత, ప్రధానలక్షణములు. అర్థముననుసరించి శబ్దము నడచును హృద యార్ద్రతను, బుద్ధివికాసమును కలిగించును.

ఎఱ్ఱనది వర్ణనాత్మకశైలి. అతడు వర్ణనలతో ఇతివృత్తము పెంచి, కావ్యము నడపించును. శంభుదాసుడు, నన్నయ అఖ్యానశైలిని, తిక్కన నాటకీయశైలిని అనుస రించి, తనదైన వర్ణనాత్మకశైలిని రూపొందించెను. ఎఱ్ఱనమహాకవి ప్రణీత హరివంశ, రామాయణ, అరణ్యపర్వశేష, నృసింహపురాణములను శీలించినచో ఆ సౌజన్యమూర్తి ఆత్మీయత వ్యక్తమగును. శైలియు, కవి ఆత్మీయతలోని భాగమేకదా! అతనికి సంస్కృత కవిత్రయమగు వాల్మీకి, వ్యాస, కాళిదాసుల పైనను నన్నయ తిక్కనలపై అపార భక్తిప్రపత్తులు, అవతారికలోని పూర్వకవిస్తుతి మంజరి పరిమళించుచున్నది.

ఉ. ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల(గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయి మంత్రభాష సుజనోత్సవ మెప్పగ నిర్వహించితా,
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తిపెంపునన్ నృ-ప- 7

నన్నయ, తిక్కనలు, పొందిన మహాకవిత్వ ప్రతిష్ఠ ఎఱ్ఱనకు ధ్యేయము. ఆ కోరికను ప్రకటించుటలో అతని వినయమధురిమ మనోహరము. కాళిదాసు, వాల్మీకి

బసిఁడి గద్దియ యాదుద్దుపైఁగరంబు ప్రీతినెలకొన సిరి పేరఁ బెంపుఁబడయ
గామినులచూడ్కి రేకులకాంతి వడసి దర్పమునఁగ్రాల నొప్పారెఁదమ్మి విరులు.

నృ-ద్వి-67

శ్రీనాథమహాకవి ఎఱ్ఱన కవితను ప్రస్తుతించెను.

"పరిఢవింతు ప్రబంధపరమేశ్వరు తేవ సూక్తి వైచిత్రి ఒక్కొక్కమాటు"

సూక్తివైచిత్రి - సూక్తులనగా సుభాషితములు, జాతీయోక్తులు, లోకోక్తులు, నీతి సహితోక్తులు, అర్థగంభీరోక్తులు, సూక్తులలోనికి వచ్చును" దండిఉక్తిని వివిధముగా ఎంగడించెను.

"భిన్నం ద్విధా స్వభావోక్త్య వక్రోక్తిశ్చేతి వాఙ్మయమ్"

1. స్వభావోక్తులను 2. వక్రోక్తులనుగా చెప్పెను. భోజమహారాజు, శృంగార ప్రకాశమున - (1) వక్రోక్తులు ఉపమాద్యలంకార ప్రధానమైనవి.

2 స్వభావోక్తులు- గుణప్రాధాన్యము కగిలినవి. 3. రసోక్తులు విభావాను భావ వ్యభిచారిసంయోగ సంజనితములైనవిగా విపరించెను.

ఇవిఅన్నియు ఎఱ్ఱన, కవితలో పుష్కలము. ఎఱ్ఱన అలంకారముల కొఱకై రచనచేయుడు. కాని నీటమొలచిన తామరలవలె, అలంకారములు సహజములై అతని గ్రంథములందు అలరారుచున్నవి. ఉపమాలంకారము కాళిదాసువలె, ఇతని చేతిలో ప్రత్యేకతను సంతరించుకొన్నది. కల్లోలభరితమగు మహాసముద్రము గాంభీర్యమున హరుని తాండవ నృత్యముగ ఉపమించినాడు.

తే. కడలుచేతులార్చుచు ఫేనమనతిరాట్ట హాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి
యౌర్వశిఖిఫాల లోచనంబునఁ గసింధు వమరఁ దాండవ మాడెడు హరుసఁబోలి

నృ-ప్ర-34

కవిభావనలో, చంద్రుడుశేషతల్పమున శయనించిన విష్ణుమూర్తివలె గోచరించు చున్నాడనుట మనోహరము.

వెన్నెలవెల్లి పాల్కడలి వ్రేఁక దనంబునఁబేర్చి దిక్కులున్
మిన్నును, ముంపనందురజనీకరబింబము కుందలీభవ
త్పన్నగ తల్పకల్పనముభంగిఁ దనర్చెఁ దంతరంబునన్
వెన్నునిభంగి జూడ్కులకు వేడ్క యొనర్చెఁగలంకమ త్తతిన్. నృ-తృ-87

చంద్రబింబము తెల్లనితాచుపాము పడగవలె, అందలి కళంకము, విష్ణుమూర్తివలె ఉన్నాడని చెప్పుట మనోజ్ఞము. ఎఱ్ఱనభావశక్తి లోకోత్తరము. ఉత్ప్రేక్షలు కూడ పరిమళించునవి.

మూడుచరణములలో ఒకసమాసము నడపు గడుసుతనము నన్నయనుండి ఎఱ్ఱనకు వచ్చినదని చెప్పనగును.

ఎఱ్ఱనపుట్టుకతో కవి. అందుచే కవిత అతనినోట, కోకిలకూజితమువలె, రమణీయముగ పలుకును. బిందుపూర్వక గకారప్రాసములో మాధుర్యగుణము అలరారునట్లు, నన్నయ రచించిన ఛందస్సుందరమైన పద్యములు. ఎఱ్ఱన పాడుకొనునట్లు పలికినాడు.

ఉ. పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు దైన్య
మెమ్మెయిన్, బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ ప్రియంబులు
పొందు సంపదల్, పొందు సమగ్రసౌఖ్యములు పొందు
సమున్నతకీర్తులెందు గోవిందపదారవింద పదవీపరిణద్ధ గరిష్ఠచిత్తులన్

నృ-ద్వి-31

తిక్కనగారి సంభాషణాచారిమను, పాత్రలరూపరేఖా విలాసములను చిత్రించుటకు ఎఱ్ఱన ప్రయత్నించెను. హిరణ్యకశిపుడు, వారసత్వన్యాయమును తనలోతర్కించుకొనుచున్నాడు.

త. అమరులతల్లికంటెను మదంబ వరిష్ఠ త్రిలోకరాజ్యభో
గములను నాక యోగ్యములుగాని నిలింపుల కెట్లు గల్గు ను
ద్యమగరిమంబుమై సురల నందఱ ద్రుచ్చుటబోలెఁ దీవ్ర దం
డమునను ఱంపి యేన తగ దక్కగ నేలుదు లోకమంతయున్ నృ-ద్వి-8

తెలుగు పలుకులను, కప్పురపు కుప్పలవలె, విరిపొట్లము విప్పినగతి అలవోకగా ఎఱ్ఱన విరచించినాడు.

తమ్మి విరుల వైభవము

సీ. అంచబోదల మోద మారంగఁజెక్కుచు
గొట్టుచు నెలదూఁడుకానలు నలుప
నలిబాలికల ముదం బెలరారఁబింపిళ్ల
గూయుచు మధువులు గ్రోలి సోల
జక్కవదో లక్క జవ్వేడుకల దిమ్మ
దివురున నకరువుల్ దిగిచికొనఁగ
మలయానిలుఁడు గర్వ మలరంగ గుబువులు
వాఱుచు నెత్తావిచూఱలాడఁ

# జాతీయములు

1 నాలుకొాడునే

2 మాకుదిక్కు

3 వాడునాకు, వానికిగలమినేను

4 అమ్ముడు వోయినట్లు

5 కలువల మొక్కు దైవమునకు నెక్కొనగ

6 ఏలచెడితిరోరి

7 చేబలచికొాంచు

8 మీదికి మారెడుపేరి

ఎఱ్ఱన సమాస కల్పనము ప్రత్యేక గుణశోభితము. స్ఫురదరుణాంశురాగరుచి, ఊర్జితము అపగతశరణ్యారిపుడు: గాంగేయభవనము, ఆక్రాంతనియత్య పేలవుడు, ప్రశాస్త్రి, నూఱుచులకైదు, మున్నీటిముద్దుకూతు

తెలుగునుడికారపు సొంపు ఎఱ్ఱనకవితకు ఆ మహాకవి సముద్రమును అచ్చతెనుగు పలుకుల కుప్పలలో పోతపోయుచున్నాడు.

సిరిపుట్టినిల్లు, రాజీవనలోచను, సెజ్జవట్టు, మహాకాంత చారగరులు డాగెడుగొంది, వాహినీ సుందరులకు సురల్భవనము పదబంధము.

1. అంచబోదలు 2. అంకణములు 3. అజ్జ 4. అతకరించు 5. అలరి 6 ఉన్నయము 7. ఉపజాతము 8. ఖడ్గారించు 9. ఓగిరము 10. ఓలించు 11. కొాకులచేయుచివ్వ, చదుళ్ళు, మచురువు, పింపిర్లుకూయు. ఈవిధముగా ఎఱ్ఱన అచ్చతెలుగు పలుకుబడిని తన గ్రంథమున క్రుమ్మరించెను. ఇన్ని కవితా గుణిభాసితు డగుటచేతనే, ఎఱ్ఱన కవిత్రయమున సుస్థిరస్థానము పొందెను,

పోతన :— పోతనార్యునిశైలి నన్నయశైలివంటి ఆఖ్యానశైలియే, దానిని పురాణ శైలి అని వ్యవహరించుచున్నారు. కర్ణపేయమైన పురాణశైలికి ప్రధానలక్షణములు, శయ్యాసౌభాగ్యము, ఉదారరచన భాగవతము శ్రీకృష్ణలీల మహిమానుభవము. పోతన మహాభక్తుడు. భక్తిశృంగారములు వర్ణించుటవల్ల అతిమాత్రమైన భావావేశము ప్రకటించెను. కళలన్నింటికి శ్రుతిలయలు సహజములు. శ్రుతిలయలును కవిత్వమున చ్ఛంద స్సుందరమైనశబ్దము ఎంతసాధింపగలదో అంత పోనత సాధించినాడు. బిందువును,

తే॥ అదరిపాటున వేసవి పొదవి కొనినఁ గలఁగి తలఁగి పోనేరక మలయ పవనుఁ
డీఁదుఁ దలదూర్చికొనియె నా నింపొనర్చె నమరుతాలవృంతముల మందానిలంబు
నృ-3-69

అర్థాంతరన్యాసము :

చ. మృగమద చందనాద్యనుపమేయ సుఖోచిత సారవస్తువుల్
దగఁగవవాతపైత్యకలితంబగు కీడుల ప్రోఁకయైన యా
యనుణశరీరముంగదిసినంతన దుష్టతఁబొందుమేలుఁ గీ
డుగ నొనరించు నీముటికిడొక్క మనంచన నమ్మఁబాడియే — నృ-చ-70

ఉత్ప్రేక్షవంత మనోహరమలో స్వభావోక్తులుకూడ అంతనిసర్గకోమలములు. వేసవియందు మనకనుభవ పునరుక్తమైన మధురానుభూతి.

ఉ. పగళులెం తోఁటనీడలు ప్రాఁతియయ్యెఁ బగపలును రేలుదనుగాలి ప్రాఁతియయ్యె
రేలువెన్నెల బయళులు ప్రియములయ్యె రేలుఁబగళునిద్రలు ప్రియములయ్యె
నృ-తృ-73

ఎఱ్ఱన తనకవితారథమును శబ్దార్థాలంకారములను జోడుగుఱ్ఱములతో అనితర సాధారణముగ నడపెను. ఎఱ్ఱన అనుప్రాసాలంకార ప్రియత్వము, పోతనార్యునిపై ప్రసరించినది.

(1) చుట్టునుగల్ప వృక్షములు చుట్టును పుష్పలతావిల్

(2) పొందవు దుఃఖముల్ నముల్

(3) వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి తండ్రియు తండ్రిగాడు

మొదలయినవి చూపవచ్చును. తెలుగుభాషలో పలుకుబడి యందేమి, కారకములందేమి, జాతీయములందేమి, నానుడులయందేమి క్రియాప్రయోగమునందేమి ఆధునికత కొంత ప్రతిఫలించు చుండును.

## నానుళ్ళు

| | | |
|---|---|---|
| 1. | కుంపటిలో దామరమొలచినక్రియ | 3-127 |
| 2. | బలియు నింటి బానిసనైన జెఱుపవెఱుతురు | 3-47 |
| 3. | మూడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేదు | 3-151 |
| 4. | ఒకగుడ్డు మురిగి పోనేమియగున్ | 4-25 |
| 5. | నిప్పునఁజెదలంటునె | 4-32 |
| 6. | నోరుమూయ పెడతవాపోయెడు | 4 39 |

భారతకథలో ఏకసూత్రతత ఉండును. ఒక ప్రధాన కథనడచును. తదనుగుణముగ ఉపాఖ్యానములు వచ్చుచుండును. ప్రధాన కథకు పోషకముగ నుండునట్లు అనేకోపాఖ్యానములు కావ్యశిల్పాభిరామములో ఉపాఖ్యానములు వచ్చుచుండును. భారతమున నున్న ఈ ప్రధాన సూత్రతత భాగవతమునలేదు. విష్ణుపారమ్యప్రబోధమే ప్రధానమైనను ప్రతి కథ స్వయం సంపూర్ణమై స్వతంత్రమై ఒప్పుచున్నది. భాగవతము ప్రబంధమందలి. ప్రహ్లాదచరిత్రాదులు అందలి ప్రత్యేక ప్రబంధపుష్పములు. వీనిలో అంతస్సూత్రము హరిభక్తి. వస్తుగతమైన స్వేచ్ఛలబించుటచే, పోతన, తన స్వతంత్రకల్పనశక్తి, సహజ వర్ణనాప్రియత్వములో మేళవించి భక్తికలకండ లచ్చుపోయ సువర్ణవకాశముపొందినాడు,

ప్రహ్లాదచరిత్ర మొత్తముమీద నాటకీయమైన శైలిలో నడపించునాడు. హిరణ్యకశిపుడు, తల్లిని, మరదంద్రను, హిరణ్యకశిపుని, ప్రియపుత్రుడైన ప్రహ్లాదునితో, చేసిన సంభాషణను మాటాడిన విధము చమత్కార యుక్తము. ప్రహ్లాదచరిత్రలో భక్తి భావము. పరమోత్కృష్టదశను పోతన అత్యద్భుతముగ వర్ణించెను. సర్వమును, విష్ణుమయముగ చూడగలిగిన ప్రహ్లాదుని స్థితప్రజ్ఞునిగా, పరిపూర్ణునిగా చిత్రించినాడు.

1. మందారమకరంద మాధుర్యమునదేలుమధుపంబు
2. తనుహృద్భాషల సఖ్యమున
3. అంధేందూయముల్
4. కమలాక్షునర్చించు కరములు కరములు

ఈపద్యములు ఆపటమునుండి వేరుచేసి చదివినను, సహృదయుడు భక్తిమకరంద రసవాహినిలోలలాడును. ఆంధ్రదేశములో భజనకీర్తనలవలె, పోతనగారి పద్యములును ఈనాటికినిపాడుకొని, తన్మయము పొందుటకంటె కవిపూజయేమిటి. పోతనగారిపద్యములు తెలుగువారి కంఠమున అలంకరించినవి. ఆచార్య శ్రీపింగళ లక్ష్మికాంతముగారు పోతన శైలినిగూర్చి చెప్పినమాటలు అన్వర్థములు. అవి కవి స్వేచ్ఛగా పాడుకొనుట, కనువుగా నున్నవి. భక్తిగానమునకు అనుగుణమైనమధురాతిమధురమైనశబ్దము. ఆశబ్ద సమూహమునకు మకుటాయమానమైన, అంత్యప్రాస, కలిసిభాగవతకవితా పఠనమునకు తాళమృదంగములుకూడిన గానసభవలె అమరినది.

విష్ణుదేవునిచరిత్రము, ప్రారంభించుచు శబ్దాలంకారము కందములో చిందింపచేసెను.

చిత్రంబుల త్రైలోక్యప
విత్రంబులు భవలతావిచిత్రంబులు స

సముద్రముచేయగల ప్రపంచీకరణప్రతిభ పోతనకు వెన్నతోపెట్టినవిద్య. మూలములో లేకపోయినను, తనకువచ్చిన భక్తిని పోతన, మందారమకరంద మాధుర్యము జాలు వారు అక్షరరమ్యమైనశైలిలో పద్యములు మనసారవర్ణించి, చరితార్థుడైనాడు. అతని శైలికి ఆత్మాశ్రయ కవితకు అనుగుణమైన గౌతిప్రాధాన్యము, అనుప్రాసాలంకార ప్రియత్వము. బంగారమునకు తావిఅబ్బినట్లైనది. ఈమనోహరశైలి సౌకుమార్యముల ఎడల ఆంధ్రులకున్న అచంచలభక్తివిశ్వాసములు, భాగవత గ్రంథము ఎడల అనూచానముగ వచ్చుచున్న భారతీయుల భక్తిభావన, భారతముకంటె, భాగవతము ఆంధ్రదేశమున విశేషప్రచారము పొందుటకు కారణములైనవి.

"కొందఱికి దెనుగు గుణమగు గొందఱికినిసంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱకి గుణములగు నే నందఱి మెప్పింతుగృతుల నయ్యైయెడలన్"
ఇది సార్థకముచేసిన కృతప్రతిజ్ఞుడు పోతన మహకవి. అతనిచేతిలో
"ఆంధేందూయముల్ ప్రస్తోకింపిత కేశపాశములల్"

వంటి సంస్కృతసమాస భూయిష్ఠమైన పద్యములు "తెక్కలురావుపిల్లలకు" అను అచ్చ తెనుగునుడికారపు సొంపుతో నలరారు పద్యములు ధారాళముగా నడచి, నన్నయ పెట్టిన అక్షరరమ్యమైన కవితా శైలికి సిద్ధిని సమకూర్చినాడు.

పోతనగారిశైలి, భావప్రయోగ దక్షత్వమునుగూర్చి సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు నుడివినమాటలు, వరహాలమూటలు.

పోతన పదములు చిలుకల గుంపువలె బారులుగట్టును. శరత్కాలప్రవాహము వలె, మందాలసముగా ప్రవహించును. కోపముగొన్న కోడెనాగువలె తోకలపైనాడును

ప్రహ్లాదచరిత్ర పరిశీలించినచో సంస్కృపదబాహుళ్యమున్నను, తేనెలొలుకు అచ్చతెనుగు పలుకబడికూడ పుష్కలము.

1. నాకున్‌తమ్ముడు నాకునెచ్చెలి
2. కట్టిడి బ్రహ్మ
3. పాపపుదైవము కంటికెంత బరువాయెనా
4. దున్నక పండు
5. ఇల్లను చాకటి నూతిలో

సౌందర్యము సంతరించుటకు తోడ్పడును. కవియనగా వర్ణననిపుణుడు. లోకోత్తర వర్ణనా నైపుణ్యమే కవిప్రతిభకు నికషోపలము. నరసభూపాలీయమున అష్టాదశవర్ణనల నుదాహరింపబడిదివి.

ఉ. పురసింధునగర్త్వినశశిసరసీవన మధురతిప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయనయ విరచనయాత్రాజిదౌత్య విభవవర్ణనముల్
నర-ద్వి-166

కావ్యమునందలి వర్ణనలుస్థూలముగ మూడువిధములు 1. వస్తువర్ణనము 2. రూపచిత్రణము 3. భావచిత్రణము. రమణీయములైన సూర్యచంద్రోదయాది ప్రకృతి దృశ్యములును, పాత్రలు వర్తించు రంగస్థలాది సన్నివేశములును వస్తువర్ణనలని చెప్పవచ్చును. రంగమున ప్రవేశించు పాత్రల రూపరేఖలను మనోభావములను వర్ణించుట, రూపచిత్రణము. పాత్రల మనోభావములను చిత్రించుట భావచిత్రణము. కథలో వివాహఘట్టము చెప్పవలెను. అపుడు ఆవివాహ మండపమును, అందలి వేదికను, నానావిధమంగళ ద్రవ్యస్థితిని, బంధుమిత్ర జనసమావేశమును వర్ణించుట వస్తువర్ణనము. పెండ్లిపీటమీద కూర్చున్న నూతన వధూవరులను వర్ణించుట రూపచిత్రణము. వారి మధురమనోభావ సంచారమును, వర్ణించుట భావచిత్రణము. ఈమూడును విడదీయరాని సంబంధముకలిగి ఉత్తరోత్తర రమణీయములై అలరారును.

వర్ణనలకు కొన్ని ప్రధాన లక్షణములు కలవు. అవి కథాగతిలో పొందుపొసగి యుండవలెను. వర్ణనలయందు ఝటితిస్ఫూర్తి, అక్లిష్టతయు ముఖ్యములు. అప్పుడే అవి స్వాభావికములై, హృదయంగములై, యొప్పును. వర్ణనలు చేయుచో దృశ్యము కన్నులకు కట్టునట్లు చేయవలెను, వర్ణనచేయుపట్ల ఏఅంగమున కాయంగము వర్ణించుటకంటె, ఆకారమంతయు మన మనమున, మెఱయునట్లు చేయవలెను.

ఎఱ్ఱన మహాకవి. నృసింహపురాణమున, ప్రసన్నగంభీర వర్ణనామహితమగు ప్రబంధముగా సంతరించెను. గ్రంథప్రారంభము పరిశీలించినచో, ఇది అహోబలతీర్థ మాహాత్మ్యమనిపించును. స్వయంసమగ్రమగు వస్తువును పురాణమువలెకాక, ఎఱ్ఱన ప్రబంధముగ తీర్చిదిద్దెను. ఎఱ్ఱనకు ప్రబంధరచనా ప్రావీణ్యము సహజపరిణద్ధసిద్ధమై వెలసినది. ఎఱ్ఱన ఈగ్రంథమును ఇంచుమించు, అష్టాదశవర్ణనలను, లోకోత్తర భావనా రమ్యముగా, స్వభావసుందరముగ నిర్వహించెను. ఒక్కమాటలో చెప్పవలె నన్నచో జనభాహుళ్యమే ఎఱ్ఱనయొక్క అభిమతము.

విచిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్

సంస్కృత సమాసములలోని లాలిత్యమును గైకొని వచ్చినవాడు నన్నయ. నన్నయను అనుసరించుటకు ఎందరో తెలుగుకవులు ప్రయత్నించి విఫలులైరి. మన పోతన అతనిని అనుకరించి సిద్ధిపొందినాడు. అతని మనోహర సమాసములు అనితర సాధారణములు.

1 మునిజన వనచైత్రంబులు
2 లలితమర్యాదుడు
3 హరిపద చింతాశీలులు
4 సుగుణాలవాలు
5 నారాగార నివిష్టపాంథులు
6 వైరివిభూషణ వంశ దూషణ
7 సూరులు పోయెడి త్రోవ పోయెను.
8 హరిపరతంత్రుడు, హతాన్య తంత్రుడు
9 స్రస్త కంపిత కేశబంధముల్
10 ఉద్దామధ్యాన గరిష్ఠుడు
11 కాననివాని నూతగొని కానివభంగి
12 శ్రీనారాయణ పాదపద్మయుగళ చింతామృతాపానదన సంధానులు మొదలైనవి.

నన్నయ వృత్తపద్యరచనమున ఆరితేరినవాడు. కందమున తిక్కన ఘనుడు. ఆవిధముగనే పోతన, వృత్తపద్యములను, సీస, కంద, ఆటవెలదులను, మనోహరముగా ధారాళమైన శైలిలో నడపినాడు. ఎట్టిదుష్కర ప్రాసమైనను అతనికి నల్లేరు మీద బండి. ఈ శైలిసౌకుమార్యము అనుప్రాసాలంకార సంయోగము పోతనకు పెట్టని ఆభరణము.

## వర్ణనలు

ప్రాచీనాలంకారికులు, అష్టాదశవర్ణన విలసితమైనది మహాకావ్యమని నిర్వచించిరి. ఈవర్ణనలు, నాయికా నాయకులు రసోద్దీపనము పొందుటకు కథకు నేపథ్య

మహాకవి ఏవర్ణనచేసినను ఒకవైశిష్ట్యముండును. శరత్కాలమున, శ్రీ మహా విష్ణువు శేషతల్పమున లక్ష్మీదేవితోకూడి మేల్కాంచినదృశ్యము పరమ రమణీయము.

నిరుపమభోగితల్పమున నిర్మలయోగవిశేష లీలమై
శరనిధికన్యకామణి కుచద్వయకీలిత వక్షుడై మనో
హర సుఖనిద్రనున్న కమలాక్షుడు మేల్కొనియె నంబోధి పెం
దరగల మ్రోత మంగళ మృదంగ ధ్వనియై చెలంగగన      నృ-ప్ర-7

ఈవర్ణన చదువుచున్నపుడు పయోధిపెందరగల మ్రోత మంగళ మృదంగ ధ్వనివలె మనవీనులకు విందుచేయుచున్నవికదా ? ఇవి లుస్తువర్ణనల కుదాహరణము. ఎఱ్ఱన కథాగతికి పోషకముగా నుండునట్లు, వసంతము, వేసవి, శరదృతువులను భావి ప్రబంధకవులకు మార్గదర్శకముగా నుండునట్లు వర్ణించినాడు. ఈవర్ణనలలో వాల్మీకి కాళిదాసాదుల ప్రభావము పుష్కలము. హిరణ్యకశిపుడు ఆయా ఋతువులలో, చేసిన ఘోరతపమునకు కమలి, కమలినకన్ను మూసెనట. ఆతనివెచ్చని ఊర్పులకు నీరు ఇగురగ నూఱటగా మంచునీరు కురిసెనట, ఆతని తపంబు తెఱగంతయు నిదురలేక, నరసి నల్లగల్వల కన్నులతో చూచుచున్నదట. వసంతసమయమునందు పురందరాదేశము పురస్కరించికొని, అచ్చరమచ్చెకంటులు, హిరణ్యకశిపుని తపోవనమందు నడయాడిన విధమును రూపకములో రూపొందించెను.

సీ. కమనీయకరపద్మకాంతి పల్లవములు
    కోమలస్మితదీప్తి కుసుమములును
జారుపయోధరస్ఫారగుచ్ఛములును
    లలితబింబాధరోజ్జ్వలఫలములు
సురభినిశ్వాస భాసురగంధపవనము
    లుచిత సల్లాపకీరోక్తములును
గలమధురోద్గీత కలకంఠరవములు
    కాంచీనినాదభృంగస్వనములు

గీ॥ నతిశయిల్లంగ మధుసమయాధిదేవతలు శుభాకారలీల లుదారిర్చనగ
నెమ్మి పుష్పాపచయకేలి నెపముఁబెట్టి యందుఁ జరియించి రిపార నిందముఖులు
                                                       నృ-ద్వి-77

ఎఱ్ఱన వర్ణనా ప్రాపీణ్యము గుఱించి, బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి మాటలు శిరోధార్యములు,

"ఎఱ్ఱనభావనా విహంగము నడుమ నడుమ, మూలాధారమునుండి సహస్రారమువఱకు భూమినుండి స్వర్గమునకును ఎగురుట ఈవర్ణనములందెడ నెడకనుగొనగలము. ఎఱ్ఱయ జన్మతఃకవి, భావుకత అతనికి పరివేషము. అతని కవితాశయ్య పుష్పగుంఫితము. హృదయము రసప్రవణము" నృ-సిం-పీఠిక-

నృసింహపురాణమునందలి వర్ణనలు సర్వాంగసుందరములు. ఎఱ్ఱన ప్రథమాశ్వాసమున, క్షీరసముద్రమును, శ్వేతద్వీపమును, పరమరమణీయముగ వర్ణించియున్నాడు, అచేతనములుకూడ, ఆ మహాకవి భావనామృతమున ప్లావితమై, మనోహరరూపములలో మనకన్నుల ఎదుట ప్రత్యక్షమగును. చంద్రోదయ శుభారంభమున వేలావధూటి పచరించిన విన్నాణము ముగ్ధమోహనము.

సీ. బిగి యుల్లసిల్లెడు పగడంపుఁగెమ్మోవి
చెలువంపు బింకంబు చిగురులొత్తఁ
దనరారుపులిననితంబ బింబమున నా
కలితమై ఫేనదుకూల మమరఁ
గ్రమ్మముక్తాఫల ఘర్మాంబు కణములు,
చెదరి యెంతయు సౌఖ్యపదవినొసఁగ
వెసఁగు నుద్వృత్త మీనేక్షణరోచుల
పొలపంబు లొయ్యారములుదలిర్ప

తే. లలితభంగులనొప్పు వేలావధూటి గ్రమ్మపిచిఁ భుజంబుల గౌఁగిలించి
ఘనరసోల్లాస లీలలఁగ్రాలి కౌశ్రిలి యుదధి తోతెంచుఁజంద్రోదయోత్సవమున
నృ-పు-ప్ర-31

పరమాణువునుండి పర్వతమువఱకు చరాచర ప్రపంచములో పరమశివుని దర్శించుట, శంభుదాసుని హృదయపరిపాకమును చెప్పక చెప్పుచున్నది. సముద్రుని తాండవమాడెడు శివునిగ దర్శించుట ఇందుకు నిదర్శనము.

తే. కడలుచేతులార్చుచు ఫేనఘనతరాట్టహాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి
యౌర్వశిఖి ఫాలలోచనఁబనగ సింధువమరు దాండవమాడెడు హరునిఁబోలి
నృసిం-ప్ర 34

లను ఆభరణములను, ఆయుధములను, చేష్టలను ఎఱ్ఱన సరససుందరముగా, సాలంకారముగ, సమాసభూయిష్ఠముగ, భావగంభీరముగను ప్రౌఢప్రబంధ ఫక్కిలో వర్ణించినాడు.

ఉదగ్రభోగిభోగమహాశ్వేతశయనీయంబునఁగమనీయహిమశైలశృంగసంగతం బగుఁ సతోయతోయదంబుచాయకు నుపమేయంబగుచుం బోలుపారుసోయగంబును, నవపారిజాత పల్లవంబుల యుల్లాసంబు నుల్లసంబాడుచు శ్రుతిసీమంతసింధూరరంజన రంజితంబులైనవి యివి యనికొనియాటలంతుం జాలి చాల జెన్నొందు చరణ తలంబులును. ... ... ... ...

నృ - 3 - 14.

నరసింహుడు స్తంభమును, భేదించుకొని, బయలువెడలునపుడు శబ్దానుగుణముగ ఉత్కళికాప్రాయముగ, ఎఱ్ఱన స్తంభోద్భవ వచనము రచించెను. ఇందలి ద్విత్వప్రాణాక్షర సంఘటనము నరసింహుని ఉగ్రతను చక్కగ ధ్వనింపచేయుచున్నది.

స్తంభోద్భవ వచనము :-

"అమ్మహాస్తంభంబున విజృంభమాణ, జిహ్వాలవివృతవదన, గహ్వర, స్ఫురద సహ్యకహ, కహో త్తర్జనగర్జాస్ఫూర్జితంబును వికటకఠోర, ఘోర, దంష్ట్రాదండ దారుణ, దహనదంద్యహ్యమాన, దశదిశాభాగంబును, విపులకపిలకూ్రతర లతారకా తరంగితోద్వృప్త తప్తాయతేక్షరూక్ష. రదనస్ఫులింగపూరితభువన, రంధ్రంబును."

నృ - పం - 82.

ఎఱ్ఱన వస్తువునందును, వర్ణనమునందును చెప్పువిధమునందును మాధుర్యముట్టిపడుచుండును. ఎఱ్ఱన వర్ణన మహార్ణవమునుండి నానేర్చినభంగి కొన్నిరత్నముల నేరి సహృదయులకు సమర్పించితిని. ఎఱ్ఱన వర్ణనలు అనంత రత్నాకరములుకదా!

## పోతన

నృసింహపురాణమునందలి, వర్ణనలను పోతన ప్రహ్లాదచరిత్రమున చేసిన వర్ణనలలో తారతమ్యపరిశీలనము చేయునపుడు కొన్ని ముఖ్యవిషయములను గుర్తింపవలెను నృసింహపురాణము స్వతంత్ర ప్రబంధము. ప్రబంధప్రక్రియానుగుణముగ వర్ణనలు సాగినవి. పోతనార్యుడు భాగవతపురాణమున ప్రహ్లాదచరిత్ర ఒక ఉపాఖ్యానము విష్ణు భాగవతోత్తమున గుణగానము చేయుట పరమాశయముగ భావించెను. ప్రబంధము వర్ణన ప్రధానము. ఉపాఖ్యానము నాటకీయముగ నడచినది. ఈ భేదము స్పష్టము.

పైపద్యములో కరపద్మము, కోమలస్మితము, చారుపయోధరములు, లలితబింబాధరము సురభినిశ్వాసము, ఉచితసల్లాపము, కలమధురోద్గీతము, కాంచీనినాదము మొదలైన పదబంధములు అచ్చరల అవయవ సౌందర్యము, హావభావవిలాసములు తెలుపుచున్నవి. వీనికి పల్లవములు, కుసుమములు, గుచ్ఛములు, ఫలములు, గంధపవనములు కరోక్తములు, కలకంఠరవములు, భృంగస్వనములు అను ప్రకృతిలోని వివిధాంశములతో, రూపకల్పన సాధింపబడినది. పైసీసపద్యములోని ఎత్తుగీతిలో అతిశయిల్లంగ, అనుపదము ఐక్యమును కూర్చుచున్నది,

వసంతవర్ణనాముఖమున భావికావ్యార్థసూచనముకూడ చేసినాడు.

ఉ. సరస కింశుక కోరక సంచయంబు చెలువు తిలకించె భావినృసింహదేవ
దీప్తనఖపంక్తిప్రకట దైతేయరుధిర సేకరుచి నొప్పుతెఱగు సూచించినట్లు
నృ-ద్వి-63

ఎఱ్ఱన మనసు పువ్వువంటిది, ఆపువ్వు నుండి ఏదివెలువడినను పరిమళము గుబాళించుచుండును. అది సత్త్వగుణశోభితమగుట విశేషము. ఏవరనను తిలకించినను హృదయము సౌందర్య తరంగితమగును. ఒక సుందరి చేతియందలి పానపాత్రలోబడి చంద్రుడు గడగడ వడకుచున్నాడు, ఆసుందరి మోమందము దొంగిలించినవాడాయె. ఇప్పుడు పట్టుపడ్డాడు. దోషాచరుడు వణక ఏమిచేయును ? వెన్నెలను గద్యములో హృద్యముగ వర్ణించుట గమనార్హము.

సుధాకరకాంతి పూరంబు రాత్రియను తలంపుతోపనాక, తమంబను నామంబును, విననీక యవ్యక్తమను శంకనంకురింపనీక లోచనంబులకు నమృతసేచనంబును, శరీరంబునకు దందనసారంబును, అంతరంగమునకు ఆనందతరంగబును నగుచు విజృంభించిన సమయంబున నృ -

ఎఱ్ఱన కవితలో ఉత్ప్రేక్షలు, ఎంత మనోహరములో స్వభావోక్తులు కూడ అంతనిసర్గకోమలములు.

తే. పగళులెలలోఁటనీఁడను బ్రాఁతియయ్యెఁ
బగళులును రేలు దనుగాలి బ్రాఁతియయ్యె
రేలు వెన్నెలబయళులు ప్రియములయ్యెఁ
రేలుఁబగళులు నిద్రలు ప్రియము లయ్యెఁ. నృ - 3 - 78.

కేవల పద్యములందేకాక గద్యములందును హృద్యమైన రచన చేయగల సమర్థుడు మన ఎఱ్ఱన. నారాయణుని చరణములనుండి శిరస్సువఱకు సకలావయవము

హిరణ్యకశిపుడు అష్టదిక్పాలురను, దేవతలను పీడించిన విధము హాస్యాభాసముగ నిరువదిపద్యములలో ఎఱ్ఱన వర్ణింపగా, పోతన ఇందు రెండుపద్యములలో నత్యంత ప్రీతిభావంతముగ చెప్పినాడు. రాజుతలచుకొన్నచో దెబ్బలకు కొదవయా? అన్నట్లు ఇంద్రాది దేవతలందరు ఏక్షణములో హిరణ్యకశిపుడు తమపై విరుచుకు పడునో అదలిపోవుచు రాజసేవచేయుచు నక్కినక్కి చురాతురుట.

శా. ఏదిక్పాలుర జూచి నే డలుగునో యేదేవు బంధించునో
యేదిగ్భాగముమీద దాడిచనునో యే ప్రాణులం జంపునో
యీదైత్యేశ్వరుడంచు నొండొరులు దారింద్రాదులాస్థానభూ
వేదిన్ మెల్లనవిక్కి చూతురుభయావిర్భూతరోమాంచులై. తె.భా. సప్తమ 100

కథాప్రారంభమున ఎఱ్ఱన ప్రవేశపెట్టిన ప్రహ్లాదునకు, పోతన పరిచయము చేసిన ప్రహ్లాదునకు చాల భేదమున్నది.

ఎఱ్ఱన :- ప్రహ్లాదుడు పుట్టినప్పటినుండి విష్ణు పదకమలధ్యాన వివశుడై,
కుడిచినపుడు నిద్రగూరినయప్పుడు మేలుకొనినయపుడు మెలంగినపుడు
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయ కాని పలుకడొండు బుద్ధి దలప డొండు.
నృ-3-150

ప్రౌఢమునులు, కోరు హితవివేక పాకము మూడేండ్లనాడే ప్రహ్లాదుడు పొందెనని సూచించెను. పోతనార్యుడు భాగవతమును బహువారములు పారాయణముచేసి ప్రహ్లాదుని మధురమూర్తిని మనకన్నుల ఎదుట చిత్రించిన విధము పరమరమణీయము

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబుగ జరగువాడు

సీ. ఆకారజన్మ విద్యార్థపరిష్కృతై
గర్వసంరంభసంగతుడుగాడు

ఆ. సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి
యసురరాజతనయు నందు నిలిచి

క. గుణనిధి యగుప్రహ్లాదుని
గుణము లనేకములు గలవుగురుకాలమునన్.

ఎఱ్ఱన, వస్తు, రస, భావ వర్ణనములలో మొదటి, ఆ రెండిఁటి కత్యంత ప్రాధాన్యమొసంగెను. వైకుంఠమును గ్రహించి సూక్ష్మాతిసూక్ష్మమైన విషయములు అన్నింటిని సర్వాంగసుందరముగ, వర్ణించుట, ఎఱ్ఱన, అభీష్టముగా గోచరించును. శంభుదాసుడు, వర్ణనలను, చేయుపట్ల ఆఖ్యానపద్ధతిని, పోతన నాటకీయమైన సరణి నవలంభించినాడు. నాటకకథ వర్ణనలభారము మోయలేదు. పోతన ప్రహ్లాదచరితమున, భగవద్గుణకీర్తనమునకు తోడ్పడునట్లు వర్ణనలు స్వల్పముగా చేసినాడు కూర్మితమ్ముని, మరణమునకు కడుదుఃఖితుడై, వివేకముపొంది, హిరణ్యకశిపుడు తల్లిని, మరదండ్రను ఓదార్చుచు ప్రాస్తావికముగ, ప్రేతబంధుయను సంవాదము చెప్పెను. సుయజ్ఞుడను రాజు శత్రువులచే, సంహరింపబడిన విధమును రాజపత్నుల వియోగదుఃఖముతో చేసిన శోకాలాపమును కరుణరస నిర్భరముగ వర్ణించెను. ఈసందర్భముననే వేటకాడు అడవిపిచ్చుకల జంటలో ఆడుపక్షిని ఉరిచే లాగి చిక్కముతో వేసికొనెను. ఆ పెంటి పిచుక శోకము హృదయవిదారకరము. ఇది కథలో పొందిపొసగియున్నది.

చ. అడవుల మేఁతమేసి, మనమన్యుల కెన్నఁడు నెగ్గుసేయ కి
క్కడ విహరింప నేఁడకట కట్టఁడి బ్రహ్మ కిరాతుచేతిలోఁ
బడుమని వ్రాసెనే నుదుట బాపుదైవము కంటికింతయె
క్కుడు బరువయ్యెనే బ్రదుకు గోమలి యేమననేర్తుఁజెల్లరే.

ఉ. రెక్కలు రావు పిల్లలకు రేపటినుండియు మేఁతగానమిం
బొక్కుచు గూటిలో నెగసిపోఁవగ నేరవు మున్ను తల్లి యీ
దిక్కుననుండి వచ్చునని త్రిప్పనిచూడ్కుల నిక్కినిక్కి న
ల్దిక్కులఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నెక్కటా.

తె॥ భా - 61 - 63.

హిరణ్యకశిపుడు ఆయా ఋతువులతో చేసిన ఘోరపతమును ఎఱ్ఱన విస్తృతముగ వర్ణించెను. దానవేంద్రుడున్న సరసికంటికి నిదురలేక, వికచకుముద నేత్ర విభవమై చెన్నొందెనట. వస్తువు, పదప్రయోగము, ఊహ, అఖిలము మధురముకదా! పోతన, హిరణ్యకశిపుని తపస్సు ప్రత్యక్షముగ వర్ణింపక, బ్రహ్మసంభాషణాముఖమున చెప్పించుట నాటకీయమై యొప్పునది.

శా. దంశవ్రాతములు న్పిపీలికలు మేదఃక్రవ్యర క్తంబుల
న్సంశీర్ణంబులు సేసి, పట్టితినగాన శల్యావశిష్టాంగవై
వంశచ్ఛిన్నతృణావళీ, యుత మహావల్మీకమందిందిర్రియ
భ్రంశఁబొఁతయులేక నీవు నిలువుంబ్రాణంబు లెట్లుండునో తె॥ భా - 37.

అధ్యయనముచేసి, ప్రహ్లాదచరిత్ర రచించినట్లు ఆధారములున్నవి. నన్నయ, తిక్కనల ప్రభావము ఎఱ్ఱనపై పుష్కలము. అట్లే ఎఱ్ఱన ప్రభావము పోతనపై ప్రసరించుటలో ఆశ్చర్యమేమున్నది.

సమకాలికుడగు శ్రీనాథమహాకవి సీసపద్యమున పూర్వాంధ్ర కవీశ్వరుల కవితా రీతులన్నియు చెప్పి, తనకవితలో మధురసమ్మేళనము పొందినవని సూచించుట గమనార్హము.

సీ. వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తుతిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరునిఠేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు

మన పోతనార్యుడు కూడ కవిత్రయమును, పాల్కుర్కి సోమనాథుని బసవ పురాణమును, భాస్కరరామాయణమును, నాచనసోముని ఉత్తర హరివంశమును, భక్తిపూర్వకముగా నధ్యయనముచేసి, తత్కవితాసౌరభమును అఘ్రాణించి, తత్ప్రభావముచే, భాగవతమును ప్రసాదించెను. ఎఱ్ఱన, వాల్మీకి, వ్యాసకాళిదాసాదులను నన్నయ, తిక్కనల అనుసరించినట్లే, పోతనయు, ఎఱ్ఱనను అనుసరించినాడని చెప్ప నగును.

ఎఱ్ఱన నృసింహపురాణమునందును పోతన, భాగవతమునందును, ప్రహ్లాద చరిత్రకలదు నృసింహపురాణ ప్రభావముచే, ప్రహ్లాదచరిత్ర అనేక ఘట్టములలో అనుసరణమున్నది. పోతన భక్తిభావ బంధురుడగుటచే, నృసింహపురాణమందలి పద్యముకుళములు భాగవతమున వికచప్రసూనములగుట అనుభవపునరుక్తము, ఎఱ్ఱన శైశవమునందే ప్రహ్లాదుడు సర్వకాల సర్వావస్థలందు భగవత్పాదారవింద ధ్యాన నిరతుడగుట చిన్న ఆటవెలది పద్యములో సరళసుందరముగ సూచించెను.

ఈచిన్నపద్యమును మహాభక్తుడగు పోతన శార్దూలపద్యములో ప్రహ్లాదుని భక్తిపారవశ్యమును గుబాళింప చేసెను.

సీ. శ్రీవత్సధరుఁడు దన్ను జేరిన యట్లైన
జెలికాండ్రనెవ్వరి జేర మఱచు

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట.

తె. భా. సప్తమ 115 - 124

భక్తికి జీవత్ దృష్టాంతముగ ప్రహ్లాదుని చిత్రించుట పోతనకు పోతనయే సాటి.

ఎఱ్ఱన పాత్రల బాహ్యాకార చేష్టలను వర్ణించునట్లు కన్పించును. నాటకీయ సన్నివేశములలో కూడ కవిమాటాడునట్లు గోచరించును. ప్రహ్లాదుని గురుగృహమునకు రావించి, అతడు నేర్చుకొన్న సుభాషిత రత్నముపన్యసింపుమని హిరణ్యకశిపుడు ప్రేమతో ప్రశ్నించెను. ప్రహ్లాదుడు సహజముగ విష్ణుమూర్తి, ఆదిమధ్యాంత రహితుడని ఉపన్యసించెను. అప్పుడు హిరణ్యకశిపుని కోపోద్రిక్తుని రూపము

ద. అనవిని గుబ్బునం బొదమునల్కకు నెచ్చెలులై కనుంగవం
గనలెడుదంట కెంపును మొగంబున బొడ్మెడుఘర్మజాలకం
బును నిటలంబునం దనరు భ్రూకుటియున్ భయముం దనర్పని
ట్లనునత డొజ్జ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుడై నృ-చ-౩

ఉపాధ్యాయునిచూచి ఓబ్రహ్మ బంధువా దురాత్మక? ఈశిశువును పరకీర్తనము చేయునట్లు నీవు ఇంతకాలము చదివించితివా ఓవత్సా? నీకు, ఈదుర్బోధ ఎవరుచేసిరి? అట్టి ఖలుని దండింతునని గద్దించెను.

ఈవిధముగా ఎఱ్ఱనకు పోతనకు వర్ణనములో భేదమున్నది.

## పోతనపై ఎఱ్ఱన ప్రభావము

పూర్వకవులు రచించిన కథాంశములను గ్రహించి తరువాత యుగములోని కవులు కావ్యరచన చేయునపుడు అరచన వైశిష్ట్యమను సాధించుటకు ప్రయత్నించుట సహజము. పూర్వకావ్యములలో అంతగా ప్రస్ఫుటములుగాని విషయములను తరువాత కవులు తమరచనలో స్ఫూర్తిమంతములుగ చిత్రించి, తమ ప్రత్యేకతను నిరూపించుకొందురు. పోతన విషయమున ఇట్లె జరిగియుండవచ్చును. ఎఱ్ఱన నృసింహపురాణమును పదునాలుగవ శతాబ్దమున, రచింపగా పోతన భాగవతమును పదునేనవశతాబ్దపు ఉత్తరభాగమున రచించెను. పోతన విధిగా, నృసింహపురాణమును,

ఇట్టి వ్యంగ్యరచనకు ఎఱ్ఱనయే పోతనకు మార్గదర్శకుడయ్యెను.

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు

శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

విష్ణుమూర్తిని వర్ణించునప్పుడు ఎఱ్ఱన భక్తిభావవివశుడై సాభిప్రాయ సౌరభ సంవాసితములైన ఉత్పలమాలనేర్చికూర్చి శ్రీమహావిష్ణువు కంఠసీమ నలంకరించెను. ప్రహ్లాదుడు మూడేండ్లనాడే విష్ణుపదకమల ధ్యానమగ్నుడైన విధము

ఉ. ఆడగబోయినప్పుడ సురాత్మజుడంబుజనాభు నవ్యయుం

బాడుద మాదిదేవు పదపంకజ పూజలుసేసి భక్తిమై

నాడుదమచ్యుతైక శరణాగతులంగని కర్మబంధముల్

వీడుదమంచు బల్కుగడు విస్మయమందగ దోడిబాలకుల్ నృ-తృ-149

పోతనార్యుడు ప్రహ్లాదుని చిన్నారిముచ్చట్లు చిన్ని జాజిపూవువంటి కందములో రచించెను.

క. ఆడుదము మనము హరి రతి

బాడుదమే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్

వీడుదము దనుజ సంగతి

గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్ భా – 7 – 248

మహాకవి సముద్రమును బిందువుగా చేయగలడు. అవసరమైనచో బిందువును సముద్రముగ చేయగలడు.

పద్యమును, గద్యమును హృద్యముగ నడపగలదిట్ట మనపోతన. ఎఱ్ఱన ప్రయోగించిన కొన్ని సమాసములు, పదబంధములు యథాతథముగ ప్రయోగించి, ఎఱ్ఱనకు సాహిత్యకర్పూర నీరాజన మొసంగెను.

"అంబుజోదర ధ్యానతత్పరత" అను సమాసమును పోతనగారు బహుపర్యాయములు ప్రయోగించుట గమనార్హము.

"హరి పదాంభోజయుగచింతనామృతమున నంతరంగు నిండినవాడైన"

శ్రీనారాయణ పాదపద్మ యుగళీచింతామృతా స్వాదసంధానుండై

అంబుజోదరదివ్య పాదరవింద చింతనామృతపాన విశేషమత్తచిత్తము

శా. పానీయంబులు ద్రావుచుంగుడుచుచున్ భాషించుచున్హాస లీ
లానిద్రాదులు సేయచుందిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచుచున్, సురారి సుతుడేత ద్విశ్వమున్ భూవరా
భా - 7 - 123

ఎఱ్ఱన, విష్ణుభక్తి రహితుల జన్మవ్యర్థమని ఉత్పలమాలలో చెప్పెను.

ఉ. ఊషరబీజముల్ భసితయోజ్య ఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్పయోధిగత వృష్టితతుల్ మృగతృష్ణికాంబుగం
డూషలు దుర్గకానన కఠోరితచంద్రిక లేడమూక స
ద్భాషలు విష్ణుమంగళ కథావిముఖాత్ముల దుష్టజన్మముల్ నృ-పం-24

పోతనార్యుడుకూడ, అదే ఎత్తుగడలో మాలోపమలో వృత్త్యానుప్రాసమునను సరించి శార్దూలపద్యములో వర్ణించినాడు.

శా. అంధే-దూయముల్ మహాబధిరశంఖారావముల్ మూక స
ద్గ్రింథాఖ్యాపనముల్ నపుంసకవధూ కాంక్షల్ గృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థ సంసారముల్ భా 7-168

ఉపాధ్యాయులు ప్రహ్లాదునితో హితోపదేశముచేయుచు మాతృదేవోభవ పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అను విధి వాక్యములు సర్వమానవులకు శిరోధార్యము. అట్టిచో తండ్రియైన హిరణ్యకశిపుని గురులమైన మామాటను తిరస్కరించి విష్ణుభక్తి అవలంబించుట ధర్మమా ? అని ప్రశ్నించెను. అద్దానికి ప్రహ్లాదుడు ఆతనికి తగినట్లు సర్వజనాహ్లాదముగ సమాధానము చెప్పుచున్నాడు. దీనిని ఎఱ్ఱన సీసపద్యములో చెప్పినాడు.

సీ. వాసుదేవుని పాదవనరుహంబులభక్తి
తగదను తండ్రియుఁ దండ్రి గాడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకు
గోపించు గురుడును గురుడు గాడు నృ_5-22

ఆదేశైలిలో పోతనార్యుడు నిషేధరూపమగు అర్థాంతర సంక్రమితవాచ్యధ్వనియై సుందరశబ్దమూర్తిని ధరించిన విధము మనోహరము

# ఉభయుల మూర్తి మత్త్వము

ఏది కావ్యము ? ఏది కావ్యముకాదు ? అను ప్రశ్నకు ప్రాచ్య పాశ్చాత్యాలంకారికులు కూలంకషముగా చర్చించిరి. కావ్యమునకు మూడు ప్రధాన లక్షణములుండవలెను.

(1) సర్వజనానురంజకత్వము (2) రచనసుందరముగా నుండవలెను. (3) గ్రంథపఠనమువలన సద్యఃపర నిర్వృతి కలుగవలెను. అది యేరసానందము. శాస్త్రమునకు, కావ్యమునకు భేదమేమి ? మానవుని విజ్ఞాన సంపాదనకు బుద్ధివికాసమునకు తోడ్పడువది శాస్త్రము. ఆశాస్త్రములు తర్కము, వ్యాకరణాదులు. కావ్యము భావనాహ్లాదమొసంగును. కావ్యకర్త సృష్టికి ప్రతిసృష్టి చేయకలడు. బ్రహ్మసృష్టికంటె కవిబ్రహ్మసృష్టి చిరంజీవము. అమరము, సమగ్రము. బ్రహ్మసృష్టి అసమగ్రము పరిణామశీలము.

కావ్యమునకు ఆత్మీయత ప్రాణము. ఆత్మీయత గుణశోభితములైన కావ్యములు సౌరభసంవాసితములైన పుష్పములు. కవితకు జన్మస్థలము కవిహృదయక్షేత్రము. అది కవిఆత్మసంతానము. ఔరసపుత్రులకంటె కవులకు, ఆత్మసంతానముపై మిక్కిలి మక్కువ. అందుచేకావ్యము కవిజీవిత సర్వస్వము. ఒకే ఇతివృత్తమును స్వీకరించి ఎవరెన్ని కావ్యములు రచించినను, ఆకావ్యములలో, పూలమాలలో సూత్రమువలె, ఆకవివ్యక్తిత్వము, ఆత్మీయత అంతర్వాహినిగా నుండును. సహృదయుడు కవి ఆత్మీయతాదర్శనము చేసినపుడే సాహిత్యవిశ్వరూపము దర్శించి పరమానంద భరితుడగును.

నృసింహపురాణమున, ఎఱ్ఱన ఆత్మీయత ప్రతిఫలించుచున్నది. ఎఱ్ఱనఅద్వైతి. అనగా, హరిహరులను సమాన ప్రతిపత్తితో దర్శించుట. ఎఱ్ఱన శంభుదాసుడయ్యెను విష్ణుద్వేషికాడు. తాత, ఎఱపోతసూరి, మనుమని మనఃపరిపక్వస్థితిని చక్కగానంచనా వేసెను.

క. గిరిశపదభక్తి రసతత్పర భావము కలిమిశంభుదాసుండనగా
బరగియు గోవింద గుణాదరసంభృత సౌమనస్య ధన్యుడవెందున్ నృ-ప-18

ఎఱ్ఱనకు కబ్బములల్లుట వెన్నతోపెట్టిన విద్య. అరణ్యపర్వశేషము రచించి ప్రబంధపరమేశ్వర బిరుదాంకితుడయ్యెను. సరస, బహుపురాణ ధర్మశాస్త్ర కథా విస్తరవేది, ప్రబంధరచనా ప్రవీణుడు. అయినను ఇసుమంత అహంకారములేదు. ఆ

శబ్దాలంకారములు, సాభిప్రాయ విశేషణములో విష్ణుమూర్తిని వర్ణించుపట్ల అప్రయత్నముగ పారవశ్యముచెందుట మొదలగునవి ఎఱ్ఱన నుండి వారసత్వముగ గ్రహించి పోతన భాగవతమును భక్తమందారముగ ప్రసాదించెను.

మహానుభావుడైన ప్రహ్లాదుడు, మోహాంధుడైన హిరణ్యకశిపుని కన్నులు తెరపించుటకు విష్ణువు గాలివలె వ్యాపించియున్నాడని విష్ణుశబ్ద వ్యుత్పత్తియగు వ్యాపనశీలమును ఎఱ్ఱన ఇట్లు ప్రసంచించెను.

సీ. కలఁడు మేదిని యందుగలడుదకంబుల
గలడు వాయువునఁదుగలడు వహ్ని
గలడు భానునియందు గలడు సోమునియందు
గలడంబరంబున గలడుదిశల
గలడు చరంబులగల డచరంబుల
గలడు బాహ్యంబున గలడు లోన
గలడు సారంబుల గలడు కాలంబుల
గలడు ధర్మంబుల గలడు క్రియల

గీ. గలడు కలవాని యందును గలడు లేనివానియందును గలడెల్లవానియందు
వింకవేయును నేలసర్వేశ్వరుండు కలడు నీయందు నాయందు గలడు కలడు

నృ - 5 - 78

భగవద్గీతయందు వర్ణింపబడిన విభూతియోగ సారాంశమంతయు ఈసీసములో రూఢమూల మగునట్లు ప్రహ్లాదుని ముఖమునుండి వెలువడుట చతురము. అస్తి= అను దానికి కలడు అని అర్థము. ఆపదమును మన పోతనగారు తీసికొని, దేవాలయములో గంటమ్రోగించినపుడు ఓం అను ప్రణవము మన చెవులలో ఆవృతమగునట్లు పద్యద్వితయమును మ్రోగించి మనచెవులలోని త్రుప్పు పోగొట్టెను.

మ. కలడంబోధిగలండు గాలిగలడా కాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలంబగళ్ళనిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గలఁడోంకారమునం త్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులందంతటం
గలడీశుండుగలండు తండ్రి వెదకంగానేల యీ యాయెడన్

క. ఇందుఁ గలఁడందులేఁడని సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందువెదకిచూచిన నందందేకలఁడు దానవాగ్రణి ! వింటే

భా-7-275-276

ధర్మరహస్యము గుర్తించుట, కత్తిమీదసాము వంటిది. ధర్మసేతువును భంగముచేసినవారు విషఫలితము పొందకతప్పదు. పెద్దవాడుముట్టినన్ను, చిట్టిపాపాయి ముట్టినను అగ్నిదహించుచును కదా ! అధర్మముకూడ అట్టిదే. కొడుకు, తండ్రిమాట వినక ఈరసమున నడచునేనివానికంటె పరమశత్రువు. ఎవ్వరు ? అతనిని అవసరమైనచో చంపవచ్చును. ధర్మఖడ్గమునకు స్వపరభేదములేదు.

ఎఱ్ఱనభక్తి మహిమను ఆద్యంతములందు గానముచేసినను అతని మనస్సు ఉపనిషత్ప్రతిపాదితమైన జ్ఞానముపైననే మ్రొగ్గినది.

శ్రీశుకమహర్షి పంచాక్షరీ జపపరాయణుడైనను, చిరునవ్వుచిందించు బాల కృష్ణుని లీలలను మధురమంజులముగా వర్ణించినట్లు, శంకరభగవత్పాదులు విష్ణు సహస్రనామభాష్యము, లక్ష్మీనరసింహస్తోత్రమును రచించినట్లు శంభుదాసుడయ్యును ఎఱ్ఱన హరివంశమును, నృసింహపురాణములను, అద్వైతామృతమును నాస్వాదించి, రచించెను.

పోతన :- భాగవతారికలో పోతనయు అద్వైతియే అనిస్పష్టము: పోతన కుటుంబమునకు వంశానుగతమైన శైవముతో సన్నిహితసంబంధమున్నట్లు భాగవత మందలి అవతారిక అద్దము పట్టుచున్నది. కేసయ లక్కసాని దంపతులు శైవపరాధీన మతులు. అన్నయగు తిప్పయ ఈశ్వరసేవాకాముడు.

మదీయపూర్వజన్మ సహస్రాంచిత తపఃఫలంబున
శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచన కుతుహలుండనై
గంగకుజని క్రుంకులిడి వెడలి మహనీయమంజుల పులిన
తలమండప మధ్యమున మహేశ్వర ధ్యానంబుచేయుచు తె॥భా-1.12

పోతనయు, వాల్మీకి వ్యాస, కాళిదాస కవిత్రయాదులను, ఆధునిక కవులను స్తుతించి, నిస్వార్థముగా భాగవతమును జగదీశ్వరుడైన శ్రీహరికి అంకితమిచ్చెను. అష్టైశ్వర్యములను తృణప్రాయముగా పరిత్యజించి, నిరహంకారియై భాగవతరచనకు పూనుకొనెను. ఆభక్తకవి. యోగిభాగవతమును చేపట్టుటలో పరమార్థము శ్రీకైవల్య పదంబు చేరుటకొఱకే.

ఉభయులు అద్వైతామృతమును ఆకంఠముగా గ్రోలిన బ్రహ్మవిష్ణులు కవి యోగులు. విజ్ఞానసాహిత్యముఖమున మోక్షమునుపొందిన మహానుభావులు. ఇద్దఱికి అభేదము చెప్పుట సముచితము. వ్యావహారికజగత్తులో భేదము సహజమైనను, ఉభయులు భక్తితో సత్యాన్వేషణకు పూనుకొనుట స్తుత్యము.

బ్రహ్మనిష్ఠుడు. ఆర్షకవులు, ప్రౌఢాంచితశబ్దసారులగు, వాల్మీకి, వ్యాస, నన్నయ తిక్కనాదులు కీలించిన కీర్తి సంగ సుఖలీలకు కాంక్షచేసిన సౌజన్యముని మూర్ధన్యము. కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కతంబున

ఉ. మించినవేడ్క పీనులకు మిక్కుటమైమధువృష్టిగ్రిమ్మరా
యంచలు కూయక్రౌంచమును నావలగూయ గడంగు
భంగి ప్రౌఢాంచితశబ్దసారులు మహాకవులాద్యులు కావ్య
శయ్యగీలించిన కీర్తి సంగసుఖలీలకు నేనునుగాంక్షజేసితిన్ నృ-2

ఎఱ్ఱాప్రగ్గడ మనస్సు పువ్వువంటిది. పరమసాత్త్విక ప్రవృత్తి అతనికినిసర్గము కవిరాజహంసలు తేనెలొలికించుచూ హంసధ్వనిరాగ మాలపింపగా, కొంచెపిట్టయు అనుకరింపుట కుపూనుకొన్నట్లు తానువారివలె, కవియశస్సు పొందకోరెను. ఆ చెప్పుటలో, ఎంతవినయ మధురిమ తొణికసలాడుచున్నదో సహృదయులు గమనింపవలెను.

కవిత్వకళ, సత్త్వగుణరజో గుణముల సమ్మేళనము. విశ్వసృష్టికి రజోగుణము, దానిమర్యాదపాలనమునకు సత్త్వగుణమావశ్యకము, అతని సర్వగ్రంథములకు ఆత్మభూషణము సత్త్వమే. నృసింహపురాణమున ఏసన్నివేశమును పరిశీలించినను భావసంయమనము గోచరించును. ఈకవితా కల్యాణగుణములే ఎఱ్ఱనకు కవిత్రయమున తృతీయస్థానము సువవస్థితమైనది.

ఎఱ్ఱయ, లక్ష్మీనరసింహావతారము ప్రబంధమనియు, కావ్యమనియు విశేషించి, విజ్ఞాన వాఙ్మయమనియు పేర్కొనెను. జ్ఞానము, విజ్ఞానము మోక్షసాధనమైన బుద్ధి అను అర్థములో ప్రాచీనులు ప్రయోగించిరి. ఆధునికులు, ఆత్మజ్ఞానమునకు, జ్ఞానమనియు, రసాయనపదార్థ విజ్ఞానశాస్త్రములకు విజ్ఞానశబ్దము వాడుచున్నారు. ఏ విజ్ఞానముచే, సర్వపరమార్థము అవగతమగునో, అదియే విజ్ఞానము. ఆ పరమార్థమును బోధించుటకొఱకే భారతీయదర్శనములు రచింపబడినవి. మహాభారతమున సర్వదర్శన సమన్వయము జరిగినట్లే, ఎఱ్ఱనకూడ నృసింహపురాణమున బ్రహ్మాది మునులచేసిన స్తోత్రముచేయించి, అందు సర్వదర్శన సమన్వయముచేసినాడు.

ఉ. తమతమ పూర్వవాసనల దత్పరులై వివిధాగమోక్తకృ
త్యములు వహించి భవ్యపరతత్త్వము నయ్యయి సంజ్ఞలంబ్రయ
త్నమున దలంచు సంయతమనస్కుల కెల్లనుజేరుచోటు శ్రీ
రమణభవత్పదంబుసుచిరస్థితి నేఋలకబ్ధి చాడ్పునన్ నృ-తృ-22

# మలిపలుకు

ఎఱ్ఱన, నృసింహపురాణమును ప్రబంధాభిముఖముగ నిర్వహించెను. పోతన, అమృతహస్తస్పర్శచే ప్రహ్లాదచరిత్రముఖమున భక్తిమకరంద వాహినులు మధుమధుర ముగ ప్రవహింపచేసెను. కాలానుగుణముగ ప్రక్రియాను గుణముగ భిన్నకాలములలో విలసిల్లిన కవులు ఒకేకథను భక్తిభావబంధురముగా సంవిధానము చేయుటలో ప్రదర్శించిన కవితాశిల్పము పరిణామసుందరము.

ఏవంగుణ విశిష్టమగు కవితాక్షీరసాగర మథనముచే సద్విమర్శామృతము సహృదయులకు లభించినచో నాకృషి ధన్యమగును. తులనాత్మక పరిశీలన ప్రాధాన్య మోక్షముల్లరు బహుధా ప్రస్తుతించెను.

The doctine that all higher knowldge in gained by comparison, and rests on comparison is as true and important in the study of Literature also

ఆంధ్రసాహిత్య విశ్వనాధులైన విశ్వనాథ ఈకవిద్వయమున కొసంగిన సాహిత్య కర్పూరనీరాజనము స్మరణీయము.

'ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు పోతన్న తెలుఁగులపుణ్యపేటి'



ఎఱ్ఱన కంటె పోతనతో రజోగుణలేశమున్నదని అనుమానింపతగును.

"పలికెడిది భాగవతమట పలికించువిభుండు రామభద్రుండటనే
పలికిన భవహరమగునట"

కొందఱికి దెనుగు గుణమగు కొందఱికి సంస్కృతము గుణమగును
గొందఱికి గుణములగు రెండునున్ నే నందఱిమెప్పింతుగృతుల నయ్యైయెడలన్

అహమ్ (నేను) అనుభావము అంతరాంతరములో ఉన్నదా ? అను భ్రాంతి కలుగును. ఇది, కవిఆత్మ ప్రత్యయమని చెప్పినను తప్పులేదు. తిక్కన మహాకవి "నానేర్చిన భంగి చెప్పవరణీయుడ నయ్యెద భక్తికోటికిన్" వినమితమస్తకుడై చెప్పినాడు కదా.

ఆంధ్రదేశమున ఎఱ్ఱన నృసింహ పురాణముకంటె పోతన ప్రహ్లాదచరిత్ర విశేషప్రసిద్ధిపొందుటకు కారణమేమి ? దీనిని అనుశీలింపవలసియున్నది.

1. ప్రాచీనకాలమునుండియు, భారతీయుల హృదయములందు భాగవతము భక్తికిపెట్టినదిపేరు. ఈభావము తరతరములనుండి వచ్చుచున్నది. ఈనాటికి ఆంధ్ర దేశమున, ప్రహ్లాదచరిత్రను పారాయణముచేయుచు, భక్తిపారవశ్యముతో, పొంగిపోవుచుండుట దర్శనీయము. అందుచే భాగవతగ్రంథముపై భారతీయులకు ప్రాచీన కాలమునుండియు భక్తిభావము అనూచానముగ వచ్చుచున్నది. గ్రంథగౌరవము మొదటిదిగా చెప్పవచ్చును.

2. పోతన కటికిదరిద్రము అనుభవించి కవిధీరుడై మెలగుటచే, ఆ కవి యెడల ఆంధ్రులకు అప్రియత్నముగ ఒకపూజ్యభావము ఏర్పడినది. కవిమీదనున్న గౌరవము కావ్యముపై ప్రసరించుట సహజముకదా !

3. ఎఱ్ఱన, పరాశ్రయకవితారీతికి చెందినాడు. పోతన ఆత్మాశ్రయకవితా రీతికి చెందినవాడు. పోతన కవితగీతిప్రధానమై అనుప్రాసాలంకార సుందరమై కర్ణపేయమైనశైలి కలిగినదై ఆంధ్రుల హృదయమందు భక్తిరస వాహినులను ప్రవహింపచేసెను.

4. ఎఱ్ఱన నృసింహపురాణమునందు అంగిరసముగా, శాంతరసమును, అంగ రసముగా, భక్తిని పోషించెను. రాజు ఎదుట భటుడు ఎట్లు ఒదిగియుండునో శాంత రసము ఎదుట భక్తిరసముకూడ అణగి, మణగి ఉన్నది. పోతన భక్తిరససముద్రము నకు పేతాముఎత్తిన కవియోగి. నృసింహపురాణము ప్రహ్లాదచరిత్రమును దీనికి విడివిడిగా, చదువుకొన్నచో సారస్వతేయులకు రసానందజనకములే. దేనిప్రత్యేకత దానిదికదా ? ఎఱ్ఱన పోతనలు ఆంధ్రసాహిత్య భక్తులకు ప్రాతఃస్మరణీయులు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 9 | 6 | రంభాదిన్య | రంభాద్య |
| 10 | 26 | యిముని | యముని |
| 11 | 28 | తనిల్లి | తల్లిని |
| 12 | 23 | లీలావతికాదు | కవేధువు |
| 17 | 6 | విర్చితానే | విర్చితాని |
| 27 | 2 | క్రమ | క్రమ |
| 36 | 13 | సుమన్సుజ్ఞేయ | సుమనస్సుజ్ఞేయ |
| 42 | 16 | మద్భభక్త | మద్భక్త |
| 43 | 1 | కఠోరితా | కఠోరిత |
| 45 | 5 | గల్ | గతా |
| 55 | 17 | దినుకకారియి | కినుకకారియ |
| 57 | 17 | వాస్త్రితి | వార్తాస్థితి |
| 60 | 20 | ప్రహ్మ | బ్రహ్మ |
| 63 | 3 | నిత్య | విశ్వ |
| 64 | 13 | క్రకటించు | ప్రకటించు |
| 70 | 2 | చేసునకు | చేతసునకు |
| 77 | 8 | ఎంగ | వింగ |
| | 22 | దంతరంబు | తదంతరంబు |
| 78 | 7 | యనుణ | యనుగుణ |
| | 17 | లతావిల్ | లతావితానములు |
| | 29 | పెడత | పెడతల |
| 79 | 9 | మారెడు | మూరెడు |
| | 15 | మహాకాకాంత | మహీకాంత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 15 | చార | చీర |
| | 15 | గరులు | గిరులు |
| | 16 | సురల్ | సురత |
| | 20 | గుపి | గుణ |
| 80 | 1 | పోనత | పోతన |
| | 4 | గాతి | గీతి |
| | 22 | నాకు | మీకు |
| | 26 | చాకటి | చీకటి |
| 81 | 28 | విచిత్రంబు | లవిత్రంబు |
| 82 | 11 | నారాగార | నీరాగార |
| | 13 | సూరులు | శూరులు |
| 84 | 14 | వాకిలిత | వాకులిత |
| 85 | 5 | నంబోధి | న్పయోధి |
| | 6 | మృదంగ | మృదంగమృదు |
| | 6 | చెలంగగన | చెలంగగన్ |
| 86 | 5 | కరోక్త | కీరోక్త |
| | 16 | వణక | వణకక |
| 96 | 9 | కొంచె | కొంచ |

———•••———